"ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ,
ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక,
సరదాగా యిది చెయ్యాలింక"





ఫెవీ ఫెయిరీ

"ఇంద్రజాలం కానే కాదిది
చేస్తోచేసే తమాషా యిది
దబ్బాతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ వస్తుయినా చేసెయ్యొచ్చు
పట్టుకోనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మేదైనా చేసెయ్యింక"

ఔల్ బౌల్ (గుడ్లగూబ) ఎలా తయారుచెయ్యాలో అనే తీరుని ఉచితంగా పొందటం కోసం యీ కూపన్‌ను పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి:
"ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020

ఔల్ బౌల్ (గుడ్లగూబ) ఎలా తయారుచెయ్యాలో అనే తీరుని ఉచితంగా పొందటం కోసం కూపన్‌ని "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020 చిరునామాకు పోస్టు చెయ్యండి.



పేరు ____________________

వయసు ____________________

చిరునామా ____________________

నగరం ____________________

రాష్ట్రం __________ పిన్ __________

మీకు మా పర్సుల్ 'ఫెవీ క్రాఫ్ట్' అందిందా? అవును/కాదు (C)

# ఫెవికాల్ ఎమ్ ఆర్ ®

సింథెటిక్ ఎడ్హెసివ్




**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది
ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**



OBM/3402 TL

# చందమామ


స్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ [''మంత్రపుటుంగరం''] కు ఆధారం, ''దేవప్రియ'' రచన. దొంగతనం అనేది చట్టరీత్యా శిక్షింపదగిన నేరం అనే మాట అలా వుంచి, అది సంఘం దృష్టిలో పెద్ద అవినీతి అనిపించుకుంటుంది. మనిషి దొంగ కావడానికి కారణం ఏమైనా, అతడిపట్ల ఎవరూ సానుభూతి చూపరు అనేది, ''దొంగా-ముసలివాడూ'' అన్న కథలో చక్కగా నిరూపించబడింది.

## అమరవాణి

విద్యా అనేకా లబ్ధ్వాపి, ఖలో నాప్నోతి గౌరవమ్,
వహన్నపి బహుస్వర్ణం, ఖరః ప్రాప్నో త్యగౌరవమ్.

[బంగారం మోసినంతమాత్రాన గాడిదకు గౌరవం కలగనట్టే, ఎన్ని విద్యలు నేర్చినా దుష్టుడికి నలుగురిలో గౌరవం అంటూ వుండదు.]


సంపుటి 75 సెప్టెంబర్ '84 సంచిక 3

విడి ప్రతి : 2-00 :: సంవత్సర చందా : 24-00




# చందమామ కబుర్లు



## సిగరెట్లు తెచ్చే ప్రమాదం

సిగరెట్లు కాల్చడం వల్ల వచ్చే క్యాన్సర్ కారణంగా ప్రపంచంలో యేటా 43 లక్షల మంది ప్రాణాలు కోల్పోతున్నారు. ఇటువంటి మరణాలు ఆసియాఖండంలో మరీ ఎక్కువగా వుంటున్నాయి.

## భయానకమైన 'జంతువు'!

జంతువులన్నిటిలోకీ, అతి భయంకరమైన జంతువు మనిషే అంటున్నారు, ఆస్ట్రేలియాకు చెందిన సుప్రసిద్ధ నాటక దర్శకుడు మైక్ ముల్లిన్స్. మనిషి సృష్టించే అణుబాంబులు, వాతావరణకాలుష్యం యావత్ప్రపంచాన్నీ సర్వనాశనం చేయజాలినవని ముల్లిన్స్ అభిప్రాయపడుతున్నాడు. ఆయన సిడ్నీజంతు ప్రదర్శనశాలలో ఇరవై ఒక్క రోజులపాటు ఒక బోనులో వుంటూ, తనముందు "ప్రపంచంలో కెల్ల భయంకరమైన మృగము" అని బోర్డు రాయించి పెట్టుకున్నాడు.





## పాటలు నేర్చిన కంప్యూటర్

పిలాని లోని బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో పాటల గురించి సర్వం తెలిసిన ఒక కంప్యూటర్ వున్నది. మనం ఒక రాగం పేరు చెబితే చాలు; ఈ కంప్యూటర్—ఆ రాగంలో పాడబడిన సినిమా పాటల పూర్తి జాబితాను, క్షణాల్లో మనకందిస్తుంది!

## మీకు తెలుసా?

1. రెడ్‌క్రాస్ సొసైటీ (1864)ని స్థాపించిన వారెవరో మీకు తెలుసా?
2. ప్రప్రథమంగా రోదసిలో 'నడిచిన' వారెవరు?
3. దక్షిణధ్రువాన్ని ప్రప్రథమంగా చేరిన వారెవరో మీకు తెలుసా?
4. ఐక్యరాజ్యసమితి తొలి కార్యదర్శి ఎవరు?
5. ప్రపంచ మతాల ప్రథమ సమావేశంలో ఉపన్యసించిన భారతీయుడు ఎవరో మీకు తెలుసా?

(సమాధానాలు 64వ పేజీలో)

ప్రవేశ రుసుము లేదు



# చందమామ కేమెల్

## రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పోస్ట్ బాక్స్ నం. 11501, నారిమన్ పాయింట్ పోస్ట్ ఆఫీస్, బొంబాయి 400 021.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి పత్ర వ్యవహారాలు జరుపబడవు.

Name: ................................................ Age: ....................

Address: ................................................................

................................................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: 30.9.1984

**CONTEST NO38**

చుక్కలు చూపిన గీత వెంట కత్తిరించండి.

Vision/CPL/84073 Tel.



# చందమామ

సెప్టెంబర్ 1984



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-00

సంవత్సర చందా: 24-00




# దొంగా-ముసలివాడూ

చలమయ్య చాలా ఆస్తిపరుడు. ఒక రాత్రివేళ ఆయన మంచి నిద్రలో వుండగా, దొంగ ఒకడు పడకగదిలో ప్రవేశించాడు. వాడు, ఇనప్పెట్టె తెరిచి, అందులోంచి బంగారు, వెండి కాసులు తీసి మూట కట్టుకుని వెళ్ళబోయి లేచేసరికి, కాలికి ఏదో తగిలి పెద్దచప్పుడయింది. చలమయ్య ఉలిక్కిపడి లేచాడు.

దొంగ ఆయనకు కత్తి చూపిస్తూ, "అరిచావో, జాగ్రత్త!" అన్నాడు.

చలమయ్యకు భయంతో వెంటనే నోటమాట రాలేదు. దొంగ పారిపోయాడు. అప్పుడు చలమయ్య మంచం దిగి, "దొంగ, దొంగ!" అంటూ పెద్దగా కేకలు పెట్టాడు.

ఆ కేకలకు ఇంట్లోవాళ్ళతోపాటు, పొరుగిళ్ళవాళ్ళు కూడా లేచారు. ఇలా జరుగుతుందని దొంగకు తెలుసు. అందు వల్ల, వాడు చలమయ్య వాళ్ళ ఇంటిగోడ దూకాక, కాసేపు వీధిలో పరిగెత్తి, దాపుల నున్న ఒక ఇంటిగోడ దూకి లోపల ప్రవేశించాడు.

ఎలాగూ ఇంట్లోకి వెళ్ళడం జరిగింది కనక, అక్కడ ఏదైనా దొంగిలించేందుకు కనబడుతుందేమో అని, వాడు పడక గదిలోకి వెళ్ళాడు. గదిలో యింకా దీపం వెలుగుతున్నది. మంచం మీద ఒక ముసలాయన కూర్చుని వున్నాడు. ఆయన ద్వారం కేసే చూస్తున్నాడు.

దొంగకు ఒక చేతిలో డబ్బు మూట వున్నది. వాడు రెండవ చేత్తో బొడ్లోంచి కత్తి బయటికి లాగాడు. అయినా, ముసలాయన అలా ద్వారం కేసే చూస్తున్నాడు. వాడు మరింత దగ్గిరకు వచ్చాక, "అడుగుల చప్పుడవుతున్నది. అబ్బాయేనా?" అన్నాడు.

"వసుంధర"



"వాడెప్పుడూ యింతే! వాడికోసం ఎదురుచూసి ప్రయోజనం లేదు. నేనింక పడుకుంటాను. మంచినీళ్ళు పక్క గదిలో వున్నవి. తాగివెళ్ళు!" అంటూ ముసలాయన మంచం మీద నడుం వాల్చాడు.

దొంగకు తప్పించుకునేందుకు, యిదే మంచి సమయం అనిపించింది. వాడు ఆ పడకగదిలోనే ఒక మూలగా తన డబ్బు మూటనూ, కత్తినీ దాచాడు. తరవాత అక్కడే గోడకు తగిలించి వున్న శుభ్రమైన పంచె, చొక్కా ధరించాడు. వాడిప్పుడు దొంగలా కాక, దొరలా వున్నాడు.

"ఏం చేస్తున్నావు, బాబూ?" అన్నాడు ముసలాయన.

"బట్టలు మార్చి కట్టుకుంటున్నానండి. మంచినీళ్ళు తాగడం కూడా అయింది. మీరు కాస్త గుమ్మందాకా వచ్చి తలుపు వేసుకోండి. నేను వెళుతున్నాను," అన్నాడు దొంగ.

"తలుపులు వేసుకోవడం ఎందుకు, బాబూ! నాకు ఒకసారి నిద్రపడితే మరి ఒళ్ళు తెలియదు. ఒక రాత్రివేళ వాడు వస్తే, ఇంట్లోకి వచ్చేదెలా?" అన్నాడు ముసలాయన మంచం దిగకుండానే.

"తలుపులు బార్లా తెరిచివుంచితే, ఏ దొంగయినా ఇంట్లో జొరబడవచ్చు. ప్రమాదం కదా!" అన్నాడు దొంగ.

ముసలాయన గుడ్డివాడని దొంగకు అప్పటికి అర్థమయింది. వాడు కత్తిని వెంటనే బొడ్లో దోపుకుని, "కాదండి, మీ అబ్బాయి స్నేహితుణ్ణి!" అన్నాడు.

"వాడింకా రాలేదా? అలాగే పానశాలలో పడివున్నాడా?" అన్నాడు ముసలాయన దిగులుగా.

ముసలాయనకు ఒక కొడుకు వున్నాడనీ, వాడు రోజూ పానశాలకు పోయి తాగుతూంటాడనీ, దొంగ అనుకున్నాడు.

"వాడీరాత్రికి ఇంటికి రాడండి. ఈ కబురు చెబుదామనే నేను వచ్చాను. కాసిని మంచినీళ్ళు తాగి వెళతాను," అన్నాడు దొంగ.

"ముసలాడినై పోయాను. ఇంకా నాకు ప్రమాదమేమిటి? అయినా, దొంగలకు మా ఇంట్లో ఏం దొరుకుతుంది కనక! వీధి తలుపులు తీసే వున్నాయి. వాటిని అలాగే వుంచు," అన్నాడు ముసలాయన.

దొంగకు ముసలాయన మీద జాలి వేసింది. ఎప్పుడైనా వీలుపడితే, ఆయన కొడుకును కలుసుకుని బాగా బుద్ధి చెప్పాలనుకున్నాడు.

తరవాత వాడు నిర్భయంగా వీధిలోకి వచ్చేశాడు. సరిగ్గా ఆ సమయంలోనే, దొంగకోసంవెతుకుతున్నవాళ్ళల్లోకొందరు అటుకేసి వచ్చారు. వాళ్ళు దొంగను చూస్తూనే, వీడెవడో మన ఊరి వాడిలా లేడు. ఇప్పుడు ఇక్కడేం చేస్తున్నాడో అడ గాలి—అనుకుంటూ వాణ్ణి సమీపించారు.

దొంగ వాళ్ళతో, "నేను, యీ పక్కం టాయన కొడుకు స్నేహితుణ్ణి. ఆయన కొడుకు తండ్రికి ఒక కబురు చెప్పి రమ్మంటే వచ్చాను," అన్నాడు.

"అదెంతవరకూ నిజమో, లోపలికి వెళ్ళి తెలుసుకుందాం పద!" అన్నాడు గుంపులో ఒకడు. దొంగ ధైర్యంగా వాళ్ళ వెంట వెళ్ళాడు.

అందరూ ముసలాయన పడకగదిలోకి వెళ్ళారు. ఆయన మళ్ళీ మంచం మీద కూర్చుని ద్వారం కేసి చూస్తున్నాడు.



"ఏమయ్యా, ఈ మనిషి మీ ఇంట్లో నుంచి రావడం చూశాం. మీ అబ్బాయి స్నేహితుడినంటున్నాడు. నిజమేనా?" అని అడిగాడు, గుంపులోని ఒకడు.

ముసలాయన గుంపులోని వారందరి వంకా చూసి, "వాడు చెప్పేదేదీ నిజం కాదు. వాడు దొంగ. చేతిలో మూటతో వచ్చాడు; రెండవ చేతిలో కత్తి వుంది. ఆ రెండూ కూడా—అదిగో, ఆ మూల దాచాడు!" అన్నాడు.

ఇద్దరు యువకులు ముసలాయన చెప్పిన చోటుకు వెళ్ళారు. అక్కడ డబ్బుమూటా, కత్తీ వాళ్ళకు దొరికాయి. దొంగ పారిపోవాలని చూశాడు. కాని,

నలుగురు యువకులు వాణ్ణి బలంగా పట్టుకున్నారు.

"అంతా మోసం! గుడ్డివాడినన్నావు; నిజమే అనుకున్నాను. నన్ను పట్టించాలనే గదా, యిలా అబద్ధం చెప్పావు?" అన్నాడు దొంగ.

"నిన్ను పట్టించాలని అబద్ధం చెప్ప లేదు. ఒంట్లో సత్తువ లేనివాడిని. నాకు కళ్ళున్నాయని తెలిస్తే, బహుశా నువ్వు, నాకు హాని చేసి వుండేవాడివి," అన్నాడు ముసలాయన.

"అలాగా! ఏదో ఒక రోజున మళ్ళీ వచ్చి, నీ మీద తప్పక పగ తీర్చుకుం టాను," అన్నాడు దొంగ కోపంగా.

ముసలాయన ఎంతో శాంతంగా, "చూడు, బాబూ! నువ్వు దొంగవి. నువ్వొక్కడివీ నా ఇంట్లోకి వస్తే, నేను కళ్ళుండీ గుడ్డివాడినయ్యాను. కాని, పది మంది చేరేసరికి, ఒంట్లో శక్తి వుండీ నువ్వు బలహీనుడివయ్యావు. దొంగ బలహీనుణ్ణి, గుడ్డివాడిగా చేస్తాడు. సమాజం ముసలివాణ్ణి కూడా శక్తి మంతుణ్ణి చేస్తుంది. నువ్వు నా మీద పగ మాని చుట్టూ వున్న పదిమందినీ నమ్ముకో. అప్పుడు వాళ్ళు తప్పక నీకు మంచి బతుకుమార్గం చూపిస్తారు. వాళ్ళను దోచి బతకాలనుకోవడం, నీకు మేలు కాదు," అన్నాడు.

వెంటనే గుంపులో ఒకడు, "తాతగారు బాగా చెప్పారు! ఇంతకాలం మన గొడవ కాదులే అని వూరుకున్నాం. రోజంతా పానశాలలో పడివుండే యీయన కొడుకును, మనమంతా కలిసి మంచి దారిలో పెట్టాలి. అది మన బాధ్యత," అన్నాడు.

ఆ తరవాత వాళ్ళు నిజంగానే ముసలాయన కొడుకును గట్టిగా మందలించి, అతడి దురలవాట్లను మాన్పి, ప్రయోజకుణ్ణి చేశారు.

కారాగారంలో వున్న దొంగకు, యీ సంగతి తెలిసి, విడుదలకాగానే తనూ పాతజీవితాన్ని విడిచిపెట్టి, మంచి మార్గాన జీవించాలనుకున్నాడు.






## 17

[పద్మపాదుడు పింగళుడికి ఎడారి దొంగలు బిడారు వర్తకులను బంధించిన గుహ చూపించాడు. హసన్‌గోరీ సైనికులతో వెళ్ళి, వర్తకులను విడిపించాడు. అప్పుడు, పింగళుడు కోరగా పద్మపాదుడు తన మంత్రశక్తివల్ల, తోడేళ్ళనూ, పెద్దపులులనూ సృష్టించి, వాటితో ఎడారి దొంగలను చుట్టుముట్టించి, తాను వున్న చోటుకు వాళ్ళను రప్పించాడు. తరవాత—]

ప్రాణభీతితో గగ్గోలు పెడుతూ తాము వున్న చోటుకు పరుగెత్తుకు వచ్చిన ఎడారి దొంగలను చూసి, హసన్‌గోరీ విజయ సూచకంగా చిన్నగా నవ్వాడు. ఎన్నో ఏళ్ళ నుంచి ఎడారి ప్రాంతాల్లో ప్రయాణించే వర్తకులను దోచుకు బతుకుతున్న క్రూరులైన యీ దొంగలు, యింత తేలికగా తన చేత చిక్కుతారని అతడెన్నడూ వూహించలేదు.

ఈ విజయానికి కారణం పద్మపాదుడైనా, నవాబు తనను తప్పక బహూకరిస్తాడని అతడు భావించాడు. ఆ కారణంవల్ల హసన్‌గోరీ పద్మపాదుడితో, ''పద్మపాదా, మీ శక్తి సాటిలేనిది. ఈ క్రూరకర్ములను పట్టుకునేందుకు చాలా సంవత్సరాల నుంచి నేను ప్రయత్నిస్తున్నాను. ఈనాటికి మీ సహాయం వల్ల అది సాధ్యమయింది. ఇక, ఈ ఎడారి ప్రాంతం

వర్తకులకూ, యాత్రికులకూ ప్రయాణ యోగ్యం అవుతుంది. మీ దయకు చాలా కృతజ్ఞుణ్ణి!'' అన్నాడు.

పద్మపాదుడు ''హసన్! నేను చేయవలసిన సహాయ మేదో చేశాను. ఇక యీ దొంగలను శిక్షించవలసిన వాడివి నీవు. నా పెద్దపులులనూ, తోడేళ్ళనూ ఉపసంహరించుకుంటున్నాను,'' అంటూ చేతులు రెండూ పైకెత్తి, ఏదో మంత్రం పఠించాడు. మరు క్షణంలోనే తోడేళ్ళూ, పెద్దపులులూ మాయమయినై. పద్మపాదుడు తన గుప్పెళ్ళలోకి వచ్చిన రాతి ముక్కలను హసన్‌గోరీకీ, పింగళుడికీ చూపి, ''ఇవే తోడేళ్ళూ, పెద్దపులులూ!'' అంటూ వాటిని దూరంగా విసిరివేశాడు.

హసన్‌గోరీ ఆజ్ఞాపించగానే, అతడి సైనికులు ముందుగా దొంగల నాయకుడైన రాబందుకు సంకెళ్ళు తగిలించి, తరవాత అతడి అనుచరులందరినీ, ఒకటిగా మోకులతో బంధించారు. ఈలోపల పద్మపాదుడు, పింగళుణ్ణి ఎడంగా తీసుకుపోయి, ''పింగళా! నీవు తిరిగీ వెంటనే అవంతీనగరంలోని మీ ఇంటికి వెళ్ళాలను కుంటున్నావా?'' అని అడిగాడు.

''అవును, పద్మపాదా! దుర్మార్గులైన నా అన్నలు నన్ను ఓడసరంగుకు అమ్మిన తరవాత, మా అమ్మను కూడా నానా హింసలూ పెడుతూండి వుంటారు. లోగడ వాళ్ళు ఇలాగే చేశారు. వాళ్ళకు కన్నతల్లి



మీద కూడా ప్రేమ లేదు.'' అన్నాడు పింగళుడు.

''నీ బాధలన్నిటికీ కారణం నీవు భల్లూకకేతుణ్ణి ఆవాహన చేసుకునే మంత్రం మరిచిపోవటం. ఇదుగో ఆ మంత్రం మళ్ళీ చెపుతున్నాను. ఈసారి అయినా బాగా జ్ఞాపకం పెట్టుకోవటం క్షేమం.'' అంటూ పద్మపాదుడు పింగళుణ్ణి దగ్గిరకు పిలిచి అతడి చెవిలో, ఆ మంత్రం జ్ఞాపకం చేసి, తన చేతి చిటికెనవేలికి వున్న వుంగరాన్ని తీసి పింగళుడికి యిస్తూ, ''ఇదిగో, యీ వుంగరాన్ని జాగ్రత్తగా కాపాడుకో. నీకు ఏనాడైనా సరే, నన్ను చూడాలని వుంటే, నీ మనసులో నన్ను తలుచుకుని, వుంగరాన్ని తాకితే చాలు, మరుక్షణం నేను నీ దగ్గిరకు వచ్చి వాలతాను.'' అన్నాడు.

''పద్మపాదా! మీ మేలు మరవరానిది. మీ దయవల్ల తిరిగి నేను నా కన్నతల్లిని చూడగలుగుతున్నాను. మీరు కూడా అవంతీ నగరం రాగలరా? మిమ్మల్ని చూస్తే, మా అమ్మ ఎంతో సంతోషించగలదు.'' అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు పింగళుడికేసి వాత్సల్యం వుట్టిపడేలా చూస్తూ, ''పింగళా! నీవు చేసిన మేలు మాత్రం నేనెలా మరిచిపోగలను? నీ సహాయం వల్లనే గదా నేను మహామాయుణ్ణి జయించగలిగింది! కనుక, ఏదో ఒకనాడు నేను మీ యింటికి అతిథిగా వచ్చి, మీ తల్లి దర్శనం కూడా





చేసుకుంటాను. సరే, ప్రస్తుతానికి నేను యీ బిడారు వర్తకులను వదిలి, ఒంటరిగానే తీర్థయాత్రలకు బయలుదేరవలసి వుంటుంది. ఇక వెళతాను,'' అంటూ చూస్తూండగానే మాయమయాడు.

పింగళుడు, హసన్‌గోరీ దగ్గిరకు వెళ్ళి, తాను తన దేశం బయలుదేరి పోతున్నట్టు చెప్పాడు. ఆ మాటలు వింటూనే, హసన్‌గోరీ ఆశ్చర్యపడి, ''పింగళా! యివేమి మాటలు? ఏదో పక్కన వున్న వూరుకు బయలుదేరి పోతున్నంత తేలికగా చెపుతున్నావు! నీ దేశానికీ యీ దేశానికీ ఎన్ని వేల మైళ్ళ దూరమో తెలుసా?'' అని అడిగాడు.

పింగళుడు చిరునవ్వు నవ్వి, ''హసన్! నా శక్తిసామర్థ్యాలు నీకు తెలియవు. నా వెంట ఆ కనబడే రాయిచాటుకు వచ్చావంటే, నీకు ఒక అద్భుత వ్యక్తి దర్శనం కలిగేలా చేస్తాను. నీ సైనికులూ, ఆ ఎడారి దొంగలూ చూడటం మంచిది కాదు,'' అంటూ దాపులనేవున్న ఒక పెద్ద రాతి చాటుకు దారి తీశాడు.

పింగళుడు మనసులో మంత్రం జపించగానే, భల్లూకకేతుడు ప్రత్యక్షమై, అతడి ముందు మోకరించి, ''ప్రభో, ఏమి సెలవు? చాలా కాలంగా యీ సేవకుణ్ణి మరిచిపోయారే!'' అన్నాడు.

భల్లూకకేతుడి భయంకరాకారాన్ని చూస్తూనే, హసన్‌గోరీ పెద్దగా అరిచి అక్కడి నుంచి పారిపోబోయేంతలో, పింగళుడు అతడి చేయి పట్టుకుని ఆపుతూ, ''హసన్! నీకు వచ్చిన భయం ఏమీ లేదు. ఈ భల్లూకకేతుడు నా సేవకుడు!'' అన్నాడు.

''ఈ రాక్షసుడు నీకు సేవకుడా!'' అంటూ హసన్‌గోరీ ఆశ్చర్యపడ్డాడు.

''అవును,'' అంటూ పింగళుడు భల్లూకకేతుడి భుజాల మీదికి యెక్కి, ''హసన్, యిక నేను నా దేశం పోతున్నాను. ఆకలి దప్పులతో అలమటించే నన్ను రక్షించావు. సర్వదా కృతజ్ఞుణ్ణి,''

అని, భల్లూకకేతుడితో, "భల్లూకా, నన్ను అవంతీనగరంలోని నా గృహానికి చేర్చు," అన్నాడు.

భల్లూకకేతుడు పెద్దగా హుంకరించి ఆకాశంలోకి లేచి, సముద్రాలూ, నదులూ, కొండలూ దాటి సూర్యోదయానికల్లా పింగళుణ్ణి, అవంతీనగర పరిసరాలలోని అతడి యింటి దగ్గిర దించాడు.

శిథిలావస్థలో వున్న యింటిని చూస్తూనే పింగళుడు నిశ్చేష్టుడయాడు. అతడు యింటి తలవాకిటిని సమీపిస్తూండగానే, బక్కచిక్కిపోయి, నీరసస్థితిలో వున్న తల్లి కనబడింది. ఉబికివస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ పింగళుడు, "అమ్మా!" అంటూ తల్లిని కావిలించుకున్నాడు.

తల్లి నివ్వెరపోయి, అంతలో తన కుమారుణ్ణి గుర్తించి, "నాయనా, పింగళా! జీవించే వున్నావా? ఎంత అదృష్టవంతురాలిని!" అంటూ ఏడవసాగింది.

పింగళుడుతల్లిని ఓదారుస్తూ, "అమ్మా, యిక మనకు వచ్చిన భయం లేదు. దుర్మార్గులైన నా అన్నలు యెక్కడ వున్నారు?" అని అడిగాడు.

"నాయనా, వాళ్ళు నీకు చేసిన ద్రోహానికి శిక్ష అనుభవిస్తున్నారు. వాళ్ళిద్దర్నీ రాజు కారాగారంలో బంధించాడు," అన్నది తల్లి.




"అలా అయితే నీవింత దీనస్థితిలో వున్నావేం? నేను వదిలిపోయిన ధనం, మహత్తుగల సంచీ వున్నవి గదా?" అని అడిగాడు పింగళుడు.

తల్లి పొంగివస్తున్న దుఃఖాన్ని దిగమింగుతూ, "వాటికోసమే రాజు వాళ్ళను కారాగారంలో పడవేశాడు," అంటూ పింగళుడు ఓడసరంగుకు బానిసగా చిక్కాం తరవాత జరిగినదంతా చెప్పింది.

తల్లి చెప్పిందంతా విని పింగళుడు కోపోద్రేకంతో వణికిపోయాడు. "అమ్మా! యీ అవంతీనగర రాజుకు తగిన ప్రతీకారం నేను చేస్తాను." అంటూ అతడు భల్లూకకేతుణ్ణి ఆవాహన చేశాడు.

"ప్రభో, ఏమి సెలవు!" అంటూ భల్లూకకేతుడు ప్రత్యక్షమయాడు.

"భల్లూకా! అవంతీనగర రాజు నా అన్నలిద్దరినీ కారాగారంలో బంధించాడు. వారిని తక్షణం యిక్కడికి తేవాలి. అంతే కాదు. అతడి కోశాగారంలో వున్న ధనాన్ని కూడా యిక్కడకు తీసుకురావాలి. మహత్తుగల సంచీ కూడా అతడి దగ్గిరే వున్నది. దాన్ని కూడా వెతికి తేవాలి," అన్నాడు పింగళుడు.

"చిత్తం ప్రభో!" అంటూ భల్లూకకేతుడు మాయమై, పాతాళంలోంచి రాజభవనంలోకి ప్రవేశించి, ధనాగారంలో వున్న ధనాన్నీ, మహత్తుగల సంచినీ తీసుకుని, కారాగారంలోకి వెళ్ళాడు.

భల్లూకకేతుణ్ణి చూస్తూనే, పింగళుడి అన్నలు జీవదత్తుడూ, లక్షదత్తుడూ కెవ్వన కేకవేసి మూర్ఛపోయారు. భల్లూకకేతుడు వారిద్దరినీ భుజాల మీద వేసుకుని, పింగళుడి దగ్గిరికి వచ్చి, "ప్రభో! యిదుగో మహత్తుగల సంచి! యీ మూటలో రాజు ధనాగారంలో వున్న డబ్బంతా వుంది! వీరు మీ అన్నలు!" అంటూ అన్నిటినీ పింగళుడి ముందు వుంచాడు.

మూర్ఛపోయిన కుమారులను చూడగానే తల్లికి వాళ్ళ మీద ఎంతో వాత్సల్యం కలిగింది. ఆమె వాళ్ళ ముఖాల మీద




నీరు చల్లి, "నాయనలారా, నాయనలారా!" అంటూ ప్రేమగా పలకరించింది.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ కళ్ళు తెరిచారు. ఎదురుగా వాళ్ళకు తల్లీ, పింగళుడూ కనిపించేసరికి ఒక్కసారిగా పైప్రాణాలు పైనే పోయినట్టయింది. వాళ్ళిద్దరూ పశ్చాత్తాపంతో కుమిలిపోతూ, "అమ్మా, పింగళా! మమ్మల్ని క్షమించాలి. మాకు బుద్ధి వచ్చింది. మా పాపాలకు ఆ చీకటికొట్లలో ప్రాయశ్చిత్తం అనుభవించాం," అన్నారు.

ఆ మాటలతో పింగళుడికి కూడా వాళ్ళ మీద జాలి కలిగింది. అయినా అతడు వాళ్ళిద్దరికేసీ కోపంగా చూస్తూ, "మీ

యిద్దరికన్న పరమనీచులూ, ద్రోహులూ, లోకంలో యెక్కడా వుండరు. కావాలంటే, యీ క్షణాన మీ యిద్దరినీ భల్లూక కేతుడి చేత పాతాళంలో పూడ్చి పెట్టించగలను, కాని, సహోదరులన్న గౌరవంతో ఈ ఒక్కసారికి మిమ్మల్ని క్షమిస్తున్నాను. ఒకవేళ తిరిగీ మీరు ఏనాడైనా నాకు గాని, అమ్మకు గాని ద్రోహం తలపెట్టారో.... మిమ్మలను ముక్కలు ముక్కలుగా నరికిస్తాను!'' అన్నాడు.

''క్షమించు తమ్ముడూ, మాకు బుద్ధి వచ్చింది!'' అన్నారు జీవదత్తుడూ, లక్షదత్తుడూ ఏక కంఠంగా.

పింగళుడు మహత్తుగల సంచీని తల్లికి యిస్తూ, ''అమ్మా, భోజనం సంగతి చూడు,'' అని చెప్పి, భల్లూక కేతుణ్ణి దగ్గిరకు పిలిచి, ''భల్లూకా! నదీ తీరాన కనబడుతున్న ఆ చెట్ల గుంపులో యీ రాత్రి గడిచి, సూర్యోదయం అయ్యేలోగా, నాకు చక్కని భవనం కట్టించాలి. ఆ భవనం అన్నిటా అవంతీనగర రాజ ప్రాసాదాన్ని మించిపోవాలి. తెలిసిందా?'' అన్నాడు.

''చిత్తం, ప్రభో! భల్లూక పర్వతాల్లో వున్న నా అనుచరుల్లో గొప్ప గొప్ప శిల్పులున్నారు. కో అంటే వాళ్ళంతా క్షణాల మీద వచ్చి దిగుతారు. వాళ్ళతో యిప్పుడే పని ప్రారంభించమని సెలవా?'' అన్నాడు భల్లూకకేతుడు.

''పగటివేళలో నీ రాక్షసగణమంతా యిక్కడికి రావటం ప్రమాదకరం. మిమ్మల్ని చూసిన తరవాత, యీ అవంతీ నగరంలో పిట్ట కూడా వుండేందుకు భయపడుతుంది. ప్రజలందరూ నగరం వదిలి పారిపోవటం, నా కిష్టం లేదు. కనుక, సూర్యాస్తమానం అయిన తరవాత పని ప్రారంభించు!'' అన్నాడు పింగళుడు.

''చిత్తం, ప్రభో! భల్లూక పర్వతాలకు వెళ్ళి, నా అనుచరులకు యీ సంగతి చెప్పి, పొద్దు గూకేసరికల్లా పని ప్రారంభిస్తాను,'' అంటూ భల్లూకకేతుడు మాయమయాడు.—(వచ్చే సంచికలో ముగింపు)






# మంత్రపుటుంగరం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇన్ని శ్రమలకోర్చి నువ్వు సాధించదలచిన కార్యంలో, ఏనాటికి విజయవంతుడి వవుతావో, నాకు తెలియదు. కాని ఒక ముఖ్య విషయం చెప్పదలిచాను. కొందరు మనుషులు, అష్టకష్టాలకోర్చి సాధించుకున్నదానిని కూడా తేలిగ్గా వదిలివేస్తారు. ఇందుకు ఉదాహరణగా నీకు, ఒక కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

సుమంతుడనేవాడు బాల్యంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్నాడు. ఒక ముని అతడిపై జాలిపడి, ఆశ్రమంలో తాను నడుపుతున్న గురుకులంలో చేర్చు

## బేతాళ కథలు



కున్నాడు. సుమంతు డక్కడ పదేళ్ళ పాటు శ్రద్ధగా విద్యాభ్యాసం చేసి, అనేక శాస్త్ర విద్యలలో చక్కటి పాండిత్యం సంపాయించాడు.

ముని అతడికి ఒక యోగ్యతాపత్రం యిచ్చి, "నాయనా, ఇక్కడ నీ విద్య ముగిసింది. ఈ చుట్టుపక్కల గల ఏ రాజ్యానికైనా వెళ్ళు. అక్కడి రాజాస్థానంలో నీకు తప్పక ఉద్యోగం లభిస్తుంది," అని దీవించాడు.

సుమంతుడు రోహితపురాన్ని పాలించే రాజు దర్శనం చేసుకోవాలనుకుని, ఆ రాజ్యం దిక్కుగా బయలుదేరాడు. కాని, కొంత దూరం ప్రయాణం చేశాక, దారి తప్పి, సూర్యాస్తమయ సమయంలో ఒక అరణ్యప్రాంతాన్ని చేరాడు.

ఆ రాత్రికాలాన్ని ఎక్కడ గడపడమా అన్న సమస్య సుమంతుడికి ఎదురయ్యింది. అతడు చుట్టూ పరికించి చూడగా, దాపులనున్న కొండ మీద ఒక శిథిలగృహం కనిపించింది. సుమంతుడు కొండకేసి బయలుదేరాడు.

కొండపాదం దగ్గిర అతడికి విలువైన దుస్తులు ధరించి వున్న, ఒక యువకుడు కనిపించాడు. అతడు ఏదో ఒక దేశపు యువరాజులా వున్నాడు. సుమంతుడు చిన్నగా నవ్వుతూ అతడికి నమస్కరించాడు.

యువకుడు ప్రతి నమస్కారం చెయ్యకుండా, "నువ్వు, నీ అదృష్టాన్ని పరీక్షించదలుచుకున్నావన్నమాట! మనలో ఆ అవకాశం ఎవరికి దక్కుతుందో తేల్చుకునేందుకు, కత్తియుద్ధం తప్ప మరొక మార్గం లేదు." అంటూ నడుం నుంచి వేళ్ళాడుతున్న కత్తిపిడి మీద చేయివేశాడు.

సుమంతుడు "మీరనేదేమిటి? మనిద్దరి మధ్యా కత్తి యుద్ధమా! అందుకు నా దగ్గిర కత్తి కూడా లేదే," అన్నాడు.

"అలా అయితే నువ్వు, వచ్చే అమావాస్య నాటివరకూ ఆగు. ఈ అమావాస్య రాత్రి, నా అదృష్టం ఏపాటితో తేల్చుకుంటాను," అన్నాడు యువకుడు.

ఈ మాటలు సుమంతుణ్ణి మరింత ఆశ్చర్యపరిచినై. అతడు యువకుడితో, "మరొకసారి చెబుతున్నాను—మీరనే దేమిటో నాకు అసలు అర్థం కావడం లేదు. మీ అదృష్టాన్నేదో పరీక్షించదలుచుకుంటే, అందుకు నేను ఏ మాత్రం అడ్డురాను. నేను ప్రయాణీకుణ్ణి. ఈ రాత్రి తల దాచుకునేందుకు చోటు వెతుక్కుంటున్నాను," అన్నాడు.

ఆ జవాబుతో యువకుడు శాంతపడ్డాడు. అతడు అక్కడికి వచ్చిన కారణం సుమంతుడికి యిలా వివరించాడు: ఆ యువకుడు రోహితపుర యువరాజు. కొండ మీద వున్న శిథిలగృహం భూత ప్రేతాలకు ఆవాసం. గత యాభైఏళ్ళుగా, ఆ శిథిల గృహంలో ప్రవేశించిన వాళ్ళెవరూ ప్రాణాలతో తిరిగి రాలేదు. ఆ గృహంలో ఒక పట్టెమంచం వున్నది. దాని మీది తలదిండు కింద, ఒక మంత్ర పుటుంగరం వున్నది. ఒక అమావాస్య చీకటి రాత్రిని ఆ శిథిలగృహంలో గడప గలిగినవాళ్ళకు, ఆ మంత్రపుటుంగరం లభిస్తుంది. దాన్ని ధరించినవాళ్ళు, నిండు నూరేళ్ళకాలం బతుకుతారు.

ఆ రోజు అమావాస్య. యువరాజు శిథిలగృహంలో రాత్రి గడిపేందుకు ప్రయత్నిస్తున్నాడు.



"ఆ మంత్రపుటుంగరాన్ని సంపాయించదలచినవాళ్ళు, ఒంటరిగా కొండ ఎక్కి, ఆ భూతప్రేతాలున్న గృహంలో తెల్లవారేవరకూ వుండాలి. నువ్వీ కొండ దిగువ వుండడం, నాకెంతో ధైర్యాన్నిస్తుంది," అన్నాడు యువరాజు.

సుమంతుడు అక్కడున్న ఒక రాతి మీద కూర్చుంటూ, "మీ కోసం తెల్లవారే వరకూ యిక్కడే వుంటాను. మీకు విజయం కలగాలన్నది, నా కోర్కె," అన్నాడు.

సూర్యాస్తమయమై క్రమంగా అరణ్యాన్ని చీకటి అలముకొన్నది. యువరాజు కొండ ఎక్కడం ప్రారంభించాడు. సుమంతుడు పక్షులూ, మృగాలూ చేసే

ధ్వనులు వింటూ, కదలకుండా కూర్చున్నాడు. కొంతసేపటికి అడుగులచప్పుడు అయి, అతడు తలతిప్పి చూశాడు. యువరాజు కొండ దిగి వస్తున్నాడు.

యువరాజు దగ్గిరకు రాగానే, సుమంతుడు అతణ్ణి, ''ఏం జరిగింది?'' అని అడిగాడు.

యువరాజు తల వంచుకుని చిన్నగా వణుకుతూ, ''సగం కొండ ఎక్కేసరికి, నాకేదో చెప్పరానంత భయం కలిగింది. తిరిగి వచ్చాను,'' అన్నాడు.

''యువరాజా, భయం ఎందుకు? దేవుడిపై భారం వుంచి, ధైర్యంగా కొండ ఎక్కు,'' అని సుమంతుడు, యువరాజును ఉత్సాహపరిచాడు.

యువరాజు మరొకసారి ధైర్యం తెచ్చుకుని కొండ మీదికి బయలుదేరాడు. అతడు కొంత దూరం వెళ్ళేసరికి, శిథిల గృహం వెనక నుంచి పెద్దగా నక్కల ఊళలు ప్రారంభమయినై. అదే సమయంలో నిప్పురవ్వలలా మెరుస్తూ, మిణుగురు పురుగులు శిథిలగృహం చుట్టూ ఎగరసాగినై.

యువరాజు మరొకసారి సుమంతుడి దగ్గిరకు తిరిగి వచ్చి, ''మిత్రమా, భూత ప్రేతాలున్న పాడుబడిన కొంపలో, రాత్రి కాలమంతా గడిపే ధైర్యసాహసాలు నాకు లేవు,'' అన్నాడు నిస్పృహగా.

సుమంతుడు కొంచెం సేపు ఆలోచించి, ''యువరాజా, నిరుత్సాహపడకు. నువ్వను



మతించితే, నేనూ ఒక ప్రయత్నం చేస్తాను," అన్నాడు.

"నిన్ను ప్రయత్నించ వద్దనేందుకు, నేనెవణ్ణి!" అన్నాడు యువరాజు శాంతంగా.

సుమంతుడు కొండ ఎక్కి భూతప్రేతాలున్న శిథిల గృహం చేరాడు. లోపల కటికచీకటి. తలుపులు బార్లా తెరిచి వున్నవి. అతడు లోపలికి అడుగు పెట్టగానే, గుండెలదిరేలాంటి వికృతమైన నవ్వులూ, అరుపులూ వినిపించినై. కాని, అతడేమాత్రం భయపడకుండా, అక్కడున్న పట్టెమంచం మీద కూర్చున్నాడు.

"నూరేళ్ళు బతకాలనుకునే, నీ దురాశ, యీ రాత్రి నీ చావుకు కారణం అవబోతున్నది, జాగ్రత్త!" అన్న భీకరమైన గొంతు సుమంతుడికి వినిపించింది.

"నాకు నూరేళ్ళు బతకాలన్న దురాశ లేదు. అయితే, ఈ రాత్రే చావడం అన్నది, విధినిర్ణయం మీద ఆధారపడి వుంటుంది," అన్నాడు సుమంతుడు నిబ్బరంగా.

భూతగృహం చాల్లాసేపు నిశ్శబ్దమైపోయింది. తరవాత హఠాత్తుగా వికవికమంటూ నవ్వు ప్రారంభమై, అది ఆగిపోగానే, ఒళ్ళు జలదరింపచేసే కీచుగొంతొకటి, "నీకు భూతప్రేత పిశాచాలంటే భయం లేదా?" అని అడిగింది.

"బతికున్న మనిషి, చచ్చిపోయిన వాళ్ళకు భయపడడమేమిటి? ఇది చాలా అసంగతం!" అన్నాడు సుమంతుడు.





ఆ వెంటనే పట్టెమంచం అటూ, యిటూ ఊగసాగింది. నిప్పులు చెరిగే వేడిగాలి ద్వారంవైపు నుంచీ, కిటికీల లోంచీ పెద్ద ధ్వనితో లోపలికి ప్రవేశించింది. గబ్బిళాలు సుమంతుడి తలను తాకుతూ రివ్వున కిందికీ పైకీ ఎగరసాగాయి. కాని, సుమంతుడు యివేమీ పట్టించుకోకుండా ధైర్యంగా మంచం మీద కదలకుండా కూర్చున్నాడు.

కొంతసేపటికి భళ్ళున తెల్లవారింది. భూతగృహంలో అంతవరకూ వినిపించిన వికృతమైన నవ్వులూ, అరుపులూ ఆగిపోయినై. అంతటా సూర్యకాంతి ప్రవేశించింది. సుమంతుడు పట్టె మంచం మీది దిండు ఎత్తి, అక్కడ వున్న మంత్రపు టుంగరాన్ని తీసుకున్నాడు.

అతడు కొండ దిగివచ్చేసరికి, యువరాజు ఒక రాతిని ఆనుకుని నిద్రపోతున్నాడు. సుమంతుడు అతడి కత్తికేసి కొంచెంసేపు చూసి, చిన్నగా దగ్గి, పక్కనే వున్న ఒక చెట్టుకొమ్మను గట్టిగా ఊపాడు. అయినా, యువరాజు కళ్ళు తెరవలేదు.

సుమంతుడు పక్కనే వున్న ఒక రాతి మీద కూర్చున్నాడు. హఠాత్తుగా కొండమీది నుంచి భయంకరమైన ధ్వని వినవచ్చింది. యువరాజు మేలుకున్నాడు. సుమంతుడూ, అతనూ కొండకేసి చూశారు. శిథిలావస్థలో వున్న భూతగృహం నిలువునా నేలకూలింది.

సుమంతుడు తాను తెచ్చిన మంత్రపు టుంగరాన్ని యువరాజు కిస్తూ, ''ఇదే, అద్భుతశక్తులుగల మంత్రపుటుంగరం!'' అన్నాడు.

''మిత్రమా, నా కళ్ళను నేనే నమ్మలేకపోతున్నాను! దీనికి ఎలాంటి బహుమానం కోరుకుంటావు?'' అని యువరాజు ఒకక్షణం ఆగి, ''నా మెడలోని, యీ రత్నాలహారం పదివేల బంగారు కాసుల విలువగలది. దీన్ని యివ్వమన్నా, నిరభ్యంతరంగా యిస్తాను,'' అన్నాడు.

సుమంతుడు ఎంతో వినయంగా, "నేను పండితుణ్ణి. ఇతరులకు విద్య బోధించడం, మరింత విజ్ఞానం సంపాయించేందుకు గ్రంథపఠనం అంటే, నాకు ఆనందం. సంపదలపట్ల, నాకు ఆసక్తి లేదు," అన్నాడు.

"అయితే, నా ఋణం తీరడం ఎలా?" అని అడిగాడు యువరాజు.

"ఆ రత్నాలహారం అమ్మగా వచ్చిన ధనాన్ని, పేదలా, వ్యాధిగ్రస్తులా సహాయానికి ఉపయోగించండి," అని సుమంతుడు, అక్కడి నుంచి బయలుదేరాడు.

ఆ జవాబుకు ఆశ్చర్యపోయిన యువరాజు, సుమంతుణ్ణి, "ఎక్కడికి వెళుతున్నావు?" అని అడిగాడు.

"ఇంకా నిర్ణయించుకోలేదు—విష్ణుపురానిగ్గాని, శమంతనగరానిగ్గాని వెళతాను," అని, సుమంతుడు వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, భూతప్రేతాలు నివసించే శిథిలగృహం నుంచి ఆనాటివరకూ, ఏ ఒక్కడూ ప్రాణాలతో తిరిగిరాలేదు. అలాంటిది, సుమంతుడు అక్కడి నుంచి ఎలా బతికి బయటపడగలిగాడు? అపూర్వశక్తులుగల మంత్రపుటుంగరాన్ని తానే వుంచుకోవచ్చుగదా? అలా చేయక దాన్ని యువ



రాజు కెందుకిచ్చినట్టు? అతడు ప్రయాణమైనది రోహితపురానికి. దాని యువరాజుతో స్నేహం అయిన తరవాత కూడా, అతడు అక్కడికిపోక, తెలియని మరొక ప్రదేశానికి పోవాలని ఎందుకు నిశ్చయించుకున్నాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "తామంటే భయం లేనివాడికి, భూతప్రేత పిశాచాలు ఎలాంటి హానీ కలిగించలేవు. అంతకు పూర్వం, ఆ శిథిల గృహంలో ప్రవేశించిన వాళ్ళందరూ వాటిని చూసి భయపడి వుండాలి. ఆ కారణం వల్లనే, వాళ్ళు

ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఇక, సుమంతుడు మంత్రపుటుంగరాన్ని తన దగ్గిరే వుంచుకోపోవడానికి చాలా కారణాలున్నవి. అతడికి విధినిర్ణయంలో నమ్మకమున్నది. మనిషి నూరేళ్ళు జీవించడం అనేది, గొప్పవరమేం కాదు. అంత సుదీర్ఘ కాలంలో వయోభారం చేతా, వ్యాధుల కారణంగా మనిషి నానా యిక్కట్లకూ గురి అయ్యే ప్రమాదం వున్నది. అన్నిటికన్న, యువరాజు ఆ మంత్రపుటుంగరం తనదిగా చేసుకోవాలనే పట్టుదలలో వున్నాడు. సుమంతుడు దాన్ని యివ్వకపోతే, అతడు తప్పక సుమంతుణ్ణి చంపి వుండేవాడు. కొండ మీది నుంచి సుమంతుడు దిగి వచ్చిన సమయంలో యువరాజు గాఢనిద్రలో వున్నాడు. కావాలంటే సుమంతుడు కత్తితో, అతడి శిరస్సు ఖండించవచ్చు. కాని, సుమంతుడు పండితుడు, జ్ఞాని.

సుమంతుడు, యువరాజుతో కలిసి రోహితపురం వెళ్ళకపోవడానికి ప్రబలమైన కారణమే వున్నది. యువరాజుకు మంత్రపుటుంగరాన్ని, స్వశక్తితో సాధించుకున్నాడన్న కీర్తికావాలి. సుమంతుడు అసలు రహస్యాన్ని, ఏనాడైనా బయట పెట్టవచ్చునన్న భయం తప్పక అతణ్ణి వేధిస్తూ వుంటుంది. అలా కాకపోతే, సుమంతుడు పండితుడని తెలిశాక, అతణ్ణి తప్పక తన ఆస్థానానికి రమ్మని ఆహ్వానించి వుండేవాడు. కాని, యువరాజు చేసినదేమంటే, సుమంతుణ్ణి అక్కడికక్కడే బహుమానంగా రత్నాలహారం తీసుకోమనడం. దాని అర్థం—ఇక నువ్వు, నా రాజ్యంలో వుండనవసరం లేదని చెప్పడం. పోతే, పండితుడైన సుమంతుడికి రోహితపుర రాజాస్థానమైనా, మరే రాజాస్థానమైనా ఒకటే. అందువల్లనే అతడు రోహితపుర మార్గం వదిలి, మరొక దిక్కుగా వెళ్ళిపోయాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# వరమైన శాపం

ధర్మవరంలో సీతయ్య అనే ఒక చిన్న పండ్లవ్యాపారి వుండేవాడు. అతను పండ్ల తోటల యజమానుల దగ్గిర నుంచి, ఆయా ఋతువుల్లో కాసే పండ్లు కొని చుట్టు పక్కల గ్రామాల్లో తిరిగి అమ్ముతూండేవాడు.

ఒకనాడు సీతయ్య రామాపురం వెళ్ళాడు. ఆ రోజు ఆ గ్రామంలో సంత జరుగుతున్నది. అతను సాయంకాలానికల్లా తెచ్చిన పండ్లన్నీ అమ్మేసి, ఇంటికి బయలుదేరాడు.

సీతయ్య నిర్జనంగా వున్న అడవిదారుల వెంట కొంతదూరం వచ్చేసరికి, బాగా చీకటి పడిపోయింది. అతడికి హఠాత్తుగా తల మీద వున్న ఖాళీ తట్ట బరువెక్కిపోయినట్టనిపించింది.

అతను యీ వింతకు ఒక్క క్షణకాలం భయంతో కంపించిపోయి, కాస్త ధైర్యం తెచ్చుకుని తట్టను కిందికి దింపి చూశాడు. తట్ట ఖాళీగా వున్నది.

"అంతా నా భ్రమ!" అనుకుంటూ సీతయ్య తట్టను తల మీద పెట్టుకుని నాలుగడుగులు వేశాడు. మళ్ళీ తట్ట బరువెక్కిపోయింది. తట్టలో ఏదో దయ్యం చేరిందన్న భయం కలిగింది, సీతయ్యకు.

"సీతయ్యా, భయపడుతున్నావా ఏం?" అన్న కంఠస్వరం అతడికి వినిపించింది.

ఆ ప్రశ్న వింటూనే సీతయ్య లేని ధైర్యం కనబరుస్తూ, "నేనా? భయపడటమా—అదేం లేదు. ఇంతకూ, నువ్వెవరివి? ఎక్కడి నుంచి మాట్లాడుతున్నావు?" అని అడిగాడు.

"ఇంతకు ముందు నీ మనసులో మెదిలింది వట్టి అనుమానం కాదు. నేను వనదేవతను! నీకు ఎలాంటి హానీ కలిగించను. ఎంతోకాలంగా, మనిషితో మోయిం

వక్కలంక రామారావు



చుకోవాలన్న కోరిక, యిప్పటికి నీవల్ల తీరింది. నీకు ఏదైనా ఉపకారం చేయ దలిచాను. ఆ కనబడే రావిచెట్టే, నా నివాసం. అక్కడిదాకా నన్ను యిలాగే మోసుకుపో,'' అన్నది వనదేవత.

సీతయ్య అతి కష్టం మీద వనదేవతను రావిచెట్టువరకూ మోసుకుపోయాడు.

''ఇక చాలు, తట్టను కిందికి దింపు,'' అన్నది వనదేవత.

సీతయ్య తట్ట దించాడు. వనదేవత, ''నీకేం కావాలో కోరుకో!'' అన్నది.

''నాకే కోరికా లేదు. ఇంతటితో వదిలి పెట్టు. అదే పదివేలు,'' అన్నాడు సీతయ్య ఆయాసపడుతూ.

''భయపడకు, సీతయ్యా! నీకేం కావాలో కోరుకో,'' అన్నది మళ్లీ వనదేవత.

''అయితే, నా ఖాళీ తట్టను తిరిగి తియ్యటి మామిడిపండ్లతో నిండేలా చెయ్యి. రేపు పోయి మరేదైనా సంతలో అమ్ము కుంటాను,'' అన్నాడు సీతయ్య.

''ఇంత చిన్న కోరికా! సరే, నువ్వు మీ ఊరి సరిహద్దులు చేరగానే, నీ తట్ట మామిడిపండ్లతో నిండిపోతుంది,'' అన్నది వనదేవత.

సీతయ్య చిరాకుపడిపోతూ, ''ఆ ఇచ్చె పండ్లేవో యిక్కడే యివ్వక, మా ఊరు చేరేదాకా ఆపడం ఎందుకు? ఇందులో ఏదో మోసం వున్నది,'' అన్నాడు.

ఆ మాటలకు వనదేవత పెద్దగా నవ్వి, ''నువ్వెట్టి అమాయకుడివి! మీ ఊరు యిక్కడికి యింకా కోసుదూరం వున్నది. అంత దూరం పండ్లతట్ట మోయడం కష్ట మని అలా అన్నాను. సరే, నీ యిష్టం! నీ ఖాళీతట్ట తియ్యటి మామిడిపండ్లతో నిండిపోయింది, ఇక తీసుకు వెళ్ళు,'' అని, మాయమైంది.

సీతయ్య పండ్ల తట్టను నెత్తికెత్తుకుని ఇల్లు చేరగానే, అతడి భార్య నూకాలమ్మ, ''ఈ రోజు సంతలో పళ్ళేం అమ్ముడు పోలేదా?'' అని అడిగింది. సీతయ్య జరిగినదంతా చెప్పాడు.

ఆమె వచ్చే కోపాన్ని ఆపుకుంటూ, "వనదేవత కావలసింది కోరుకోమంటే, నువ్వు కోరింది, యీ తట్టనిండు మామిడి పళ్ళన్నమాట! ఏ బంగారమో కోరి వుంటే, మన దరిద్రం తీరిపోయేది. నీకాపాటి తెలివి కూడా లేదు," అన్నది.

తరవాత సూకాలమ్మ, తట్టలోంచి ఒక మామిడిపండు తీసుకుని, దాన్ని కోసి ఒక ముక్క తిని, ఆశ్చర్యంగా, "ఇంత తియ్యదనం గల మామిడిపండు, నా జన్మలో తినలేదు. నువ్వూ, ఒక ముక్క తిని చూడు. పండు పది రూపాయిలన్నా జనం ఎగబడి కొంటారు," అన్నది.




ఆ మర్నాడు సీతయ్య వెంకటాపురం సంతకు వెళ్ళి, అడిగినవాళ్ళకు మామిడి పండు పది రూపాయిలని చెప్పసాగాడు. అది విని జనం నవ్వుకున్నారు. కాని, ఒక ధనికుడు పండు రుచిచూసి ఆనందపడి పోతూ, అతడి దగ్గిర పది పండ్లు కొన్నాడు. అది చూసిన మరికొందరు క్షణాల మీద తట్టలోని పళ్ళన్నీ కొనేశారు. సీతయ్యకు రోజూకన్న పదింతలు లాభం వచ్చింది. అతడు సంతోషంగా ఇల్లు చేరాడు.

సీతయ్య ఎప్పటిలాగే మరసటి రోజున, ఒక మామిడితోట యజమాని దగ్గిర పళ్ళు కొని, వెంకటాపురం వెళ్ళాడు. కాని, ఆ రోజు అతడివద్ద ఎవరూ పళ్ళు కొనలేదు. అందరూ నిన్న తెచ్చిన పండ్ల లాంటి తియ్యటి పండ్లు తెమ్మన్నారు. అతడికి ఎక్కడలేని దిగులు పట్టింది.

చీకటిపడుతూండగా సీతయ్య బయలు దేరి, వనదేవత కనిపించిన రావిచెట్టు దగ్గిరకు వచ్చి, పెద్ద గొంతుతో, "ఓం, వనదేవతా! నీవేదో మేలన్నావే, అది నాకు కీడుగా తయారయింది!" అంటూ కేక పెట్టాడు.

వనదేవత వెంటనే అతడి ముందుకు వచ్చి, "ఏం జరిగింది?" అని అడిగింది.

సీతయ్య అంతా చెప్పాడు. వనదేవత సానుభూతికనబరుస్తూ, "అలాగా, సరే, మరేదైనా కోరుకో యిస్తాను," అన్నది.



"నాకు మణుగు బంగారం కావాలి!" అన్నాడు సీతయ్య.

"ఇచ్చాను. దాన్ని కాస్త జాగ్రత్తగా కాపాడుకో." అంటూ వనదేవత మాయమయింది.

సీతయ్య మణుగు బంగారం వున్న తట్టను నెత్తిన పెట్టుకుని, ఇంటిదారి పట్టాడు. అయితే, దారిలో వీరభద్రుడనే గజదొంగ అతడికి తారసపడి, "మర్యాదగా, ఆ మామిడిపళ్ళ తట్ట అక్కడ పెట్టి, నీ దారినపో," అన్నాడు.

సీతయ్య వాడికి ఎదురుతిరిగి, "నా ప్రాణం పోయినా సరే, తట్టమాత్రం నీకివ్వను," అన్నాడు.

ఒక తట్ట మామిడిపళ్ళకోసం ప్రాణానికి తెగించడమేమిటా అని గజదొంగ ఆశ్చర్యపోతూ దుస్తుల్లోంచి కత్తి బయిటికి తీశాడు. ఇద్దరూ కలియబడ్డారు. గజదొంగ వీరభద్రుడు చాలా బలవంతుడు; వాడికి సీతయ్యను చంపాలని లేదు. అతణ్ణి హడలకొట్టేందుకు కత్తితో భుజం మీద చిన్నగా పొడిచాడు.

సీతయ్య హడలిపోయి ఒక చావుకేక పెట్టి, "ఒరే, వీరభద్రుడూ! నా నుంచి అంత బంగారం దోచుకుని నువ్వు బాగుపడవులే," అంటూ అక్కణ్ణించి పారిపోయాడు.

వీరభద్రుడు ఆ ప్రాంతాల పేరు మోసిన గజదొంగ అన్న సంగతి రాజుగారికి ఏనాడో తెలిసింది. ఆయన వాణ్ణి పట్టి యిచ్చినవారికి గానీ లేక శవాన్ని అందజేసినవారికి గానీ లక్ష రూపాయలు బహుమానం యిస్తానని చాటింపు వేయించి వున్నాడు.

సీతయ్య తగిలిన గాయానికి కట్టు కట్టించుకుని, మరసటి రోజు రావిచెట్టు దగ్గిరకు వెళ్ళి, వనదేవతకు జరిగింది చెప్పాడు.

ఆమె కోపంగా ముఖం పెట్టి, "నువ్వు నష్టజాతకుడివయి వుండాలి. అలా కాకపోతే, నేను మేలుకోరి యిచ్చినవి, నీకు

కీడు కలిగించవు. ఇక బతికుండగా, యీ రావిచెట్టు చాయలకురాకు!'' అన్నది.

సీతయ్య కూడా కోపం తెచ్చుకుని, ''నువ్వు, నా నెత్తిమీది తట్టలో కూర్చుని ఊరేగిన రోజు నుంచే, నాకీ కష్టాలు ప్రారంభమయినై. నాకేదో కొంత ధనం యివ్వకపోతే, నేనూరుకోను!'' అన్నాడు.

ఆ మాటలకు వనదేవత కళ్ళెర్రచేసి, "ఛీ, నన్ను భయపెట్టాలనుకుంటున్నావా? ని పాపిష్టిముఖం మరెన్నడూ నాకు చూపించకు. ఈ రోజు నీ పాపిష్టి ముఖం ముందుగా ఎవరు చూస్తారో, వాళ్ళు నెత్తురు కక్కుకుని మరీ చస్తారు. ఇకపో!'' అంటూ మాయమయింది.

సీతయ్య దిగులుగా ఇంటిదారి పట్టాడు. తనకు ముందుగా ఎదురుపడినవాడికి చావు తప్పదు! అలా ఎదురుపడేది తన ఊరువాడెవడైనా కావచ్చు, లేక తన భార్యే కావచ్చు. ఇప్పుడేం చేయడం?

విచారంతో తల వంచుకుని నడుస్తున్న సీతయ్యకు ఒక చెట్టు చాటు నుంచి వికవికమంటూ పెద్దగా నవ్వు వినిపించింది. అతడు తల ఎత్తి అటుకేసి చూసేంతలో, గజదొంగ వీరభద్రుడు చెట్టుచాటు నుంచి బయిటికి వస్తూ, ''ఏం సీతయ్యా! మళ్ళీ ఏమైనా మణుగు బంగారం వెంట తెస్తున్నావా?'' అని అతడి ముఖం కేసి చూస్తూనే గావుకేక పెట్టి, కిందపడి నెత్తురు కక్కుతూ క్షణాల మీద చచ్చిపోయాడు.

అది చూస్తూనే సీతయ్యకు రాజుగారి చాటింపు గుర్తు వచ్చింది. అతడు గజదొంగను భుజాన వేసుకుని గ్రామం చేరి, వాణ్ణి అడవిలో హెూరాహెూరి పోరాడి చంపినట్టు గ్రామస్థులకు చెప్పాడు.

వారం తిరక్కుండానే మహారాజు, సీతయ్యను రాజధానికి పిలిపించి, గజదొంగను చంపినందుకు అతడికి లక్ష రూపాయిలు బహూకరించాడు.

వనదేవత కోపం కొద్దీ పెట్టిన శాపం, తన పాలిట వరమైనందుకు సీతయ్య చాలా సంతోషించాడు.





# నరకవాసం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో ఒకప్పుడు బోధిసత్వుడు ఒక వానరముగా జన్మించాడు. ఈ వానరం పేరు 'నందీయుడు.' నందీయుడికి ఒక సోదరుడున్నాడు. సోదరు లిద్దరూ హిమాలయ ప్రాంతాలలో ఎనభైవేల కోతుల మందకు నాయకులుగా ఉంటూ వున్నారు. నందీయుడికి ఇంటి దగ్గర పోషించవలసిన తల్లి వున్నది. ఆమె పాపం, అంధురాలు.

నందీయుడూ తమ్ముడూ కలిసి రోజూ, వనాలలో దొరికే మంచి మంచి ఫలాలన్నీ పట్టుకువచ్చి, మందలోని సేవకుల ద్వారా తల్లికి పంపించేవాళ్ళు. ఐతే, ద్రోహులైన సేవకులు ఆ ఫలాలను తల్లికి అందివ్వక, తామే కాజేస్తూ వచ్చారు!

ఒకనాడు నందీయుడు తల్లిని చూడ వచ్చాడు. అమెను చూసి, ఆశ్చర్యపోయి, "అమ్మా! ఏమిటిలా శుష్కించిపోయావు, తిండి లేనట్టుగా? రోజూ మేం పంపే ఫలాలు తినటం లేదా?" అని అడిగాడు.

"లేదు, నాయనా! ఫలాలూ లేవు, ఏమీ లేవు. తిండి ఉంటే ఎందుకిలా చిక్కిపోతాను?" అని చెప్పింది తల్లి.

నందీయుడు బాగా అలోచించాడు. నిజం బోధపడింది. వెంటనే హిమాలయాలకు వెళ్ళి జరిగిందంతా చెప్పి, "తమ్ముడూ! ఇంటివద్ద ఉండి నేను అమ్మపోషణ చూస్తాను. నీవు నాయకత్వం వహించి, ఈ మందను ఏలుకో," అన్నాడు.

అందుకు చిన్నవాడు, "అన్నయ్యా! నీతోపాటు నేనూ ఇంటి దగ్గరనే ఉండి, అమ్మపోషణ చూస్తాను," అన్నాడు.

ఈ విధంగా ఇద్దరూ ఏక మనస్కులై, ఇంటికి వెళ్ళారు. తల్లికి ఒక రావిచెట్టు మీద చక్కని బస అమర్చి, ఆమెకు

ఏ కొరతా రాకుండా వేయికళ్ళతో కాపాడుతూ వచ్చారు.

ఇదిలా వుండగా ఒకానొక బ్రాహ్మణుడు తక్షశిలా నగరంలో గురువువద్ద విద్యలు అభ్యసిస్తున్నాడు. విద్యాభ్యాసం పూర్తి ఐన తరువాత అతడు గురువువద్దకు పోయి, సెలవిమ్మని అనుజ్ఞకోరాడు.

ఆయన ఈ శిష్యుని చూసి, "నాయనా! నీవు విద్యలు పూర్తి చేసుకున్నావు. సంతోషమే. నీది తీవ్రస్వభావము. తొందరపడి ఎన్నడూ క్రూరమైన పనులు చేయబోకు, తరవాత పశ్చాత్తాపపడినా లాభం లేదు. ఇదే నా ఉపదేశం," అని చెప్పి దీవించాడు.

బ్రాహ్మణ కుర్రవాడు గురువు వద్ద సెలవు తీసుకొని, కాశీనగరం చేరుకొన్నాడు. పెళ్ళి అయింది, గృహస్థాశ్రమం స్వీకరించాడు. అతనికి ఏ విధంగానూ పొట్ట పోసుకోవడానికి దారి కనబడలేదు. అందుచేత, విల్లమ్ములు చేతపట్టి బోయవాని వృత్తి అవలంబించాడు. జంతువులనూ, పక్షులనూ వేటాడి, వాటి మాంసం విక్రయించి, ఆ వచ్చిన డబ్బుతో కాలక్షేపం చేస్తూ వచ్చాడు.

ఒక రోజున ఎంత తిరిగినా బ్రాహ్మడికి ఒక్క జంతువు కూడా దొరకలేదు. ఇక లాభం లేదని ఇంటికి మరలిపోతూ,



అతడు ఒక రావిచెట్టు కేసి చూశాడు. ఆ సమయాన చెట్టు కొమ్మలలో తల్లికి ఫలాహారం పెట్టి స్తిమితపరిచి, ఆమె వెనుకనే నందీయుడూ, తమ్ముడూ కూర్చొని వున్నారు. వాళ్ళూ బోయవాడిని చూశారు.

అప్పుడు చెట్టుకేసి చూస్తూ బోయవాడు, ఉత్త చేతులతో ఇంటికి మరలడమేమిటని తలచి, తల్లి కోతికి బాణం గురిపెట్టాడు. దానిని నందీయుడు చూసి, తమ్ముడితో, "అదుగో, వాడు మన తల్లికేసి బాణం గురి పెట్టాడు. ఆమె ప్రాణాలకు నేను అడ్డుపడతాను. నేను పోయిన తరువాత ఆమెను నీవే రక్షించాలి!" అంటూ గబగబ చెట్టు దిగి వచ్చాడు.

"ఓయీ, బోయవాడా! మా తల్లిని చంపకు. అమె ముసలిది, కావాలంటే ఆమెకు బదులు నన్ను చంపు." అన్నాడు నందీయుడు.

అందుకు కఠినాత్ముడైన ఆ బోయ వాడు 'సరే'నంటూ నిర్దాక్షిణ్యంగా నందీయుణ్ణి బాణంతో కొట్టాడు.

ఐతే, ఆ మాట మీద నిలబడక బోయ వాడు, నందీయుడు చనిపోగానే మళ్ళీ తల్లి కోతికి బాణం గురిపెట్టాడు. ఇది కనిపెట్టి, ఈసారి చిన్నవాడు దిగి వచ్చి, తన అన్న చెప్పినట్టే చెప్పాడు బోయ వానితో. 'సరే' నన్నాడు బోయవాడు. నిర్దాక్షిణ్యంగా చిన్నవాడిని కూడా చంపి వేశాడు.

"నాకూ, నా కుటుంబానికీ ఈ రెండు కోతులూ చాలు," అని అనుకొన్నాడు. కాని, మరుక్షణంలోనే అతడి మనసు మారిపోయింది. వాడు దయమాలి ఏమాత్రం పాపభీతి లేకుండా బాణంతో తల్లి కోతిని కూడా కొట్టి, కూల్చివేశాడు.

ఈ విధంగా ఆనాడు చంపిన మూడు కోతులనూ భుజాన వున్న కర్రకు వేలాడ వేసి, ఉత్సాహంతో ఇంటిముఖం పట్టాడు. ఊరి పొలిమేర చేరుకొనేసరికల్లా— పిడుగుపడి వాడి ఇల్లు కాలిపోతున్నదనీ, వాడి భార్యా, ఇద్దరు బిడ్డలూ దానిలోనే ఉండిపోయారనీ తెలిసింది!

ఈ మాట చెవిని పడేసరికి, చెప్పలేని దుఃఖంతో గుండెలు బాదుకొంటూ ఇంటికి పోయాడు. వాడు సాహసించి లోపలికి వెళ్ళేటప్పటికి, వాడు నించున్న చోట భూమి హఠాత్తుగా బద్దలయింది. వాడు పాతాళానికి పోతూ, ఈ సంగతి జ్ఞాపకం తెచ్చుకొన్నాడు:

"నా గురువుగారు ఆనాడే చెప్పారు, క్రూరమైన పనులు చేయవద్దని— పశ్చాత్తాపపడినా లాభం ఉండదు సుమా అని. నే చేసుకున్న పాపాలకు తగిన ప్రాయశ్చిత్తం అనుభవిస్తున్నాను...." అనుకొంటూ మరి కనబడకుండా నరక వాసానికి పోయాడు.





# అధికార మార్పిడి

బ్రిటిష్ సేనలు ఢిల్లీని పట్టుకోవడంతో, సిపాయిల తిరుగుబాటు అంతిమదశకు వచ్చింది. అయినా, బ్రిటిష్ సేనలు ఢిల్లీని చుట్టుముట్టిన కొన్ని గంటలలోనే, జాన్ నికల్సన్ అనే బ్రిటిష్ సేనా నాయకుడు, తిరుగుబాటుదారుల తుపాకి దెబ్బకు నేలకూలాడు.

తిరుగుబాటుదారులు తమ చక్రవర్తిగా గుర్తించిన వృద్ధుడైన ఆఖరి మొగల్ పాలకుడు బహద్దూర్ షా, నిస్సహాయుడయ్యాడు. తమ పూర్వీకుడైన హుమయూన్ గోరీ సమీపంలో బహద్దూర్ షా దుర్మార్గుడైన మేజర్ హడ్సన్ ముందు శరణుపొందాడు.





గోరీకి వెనుక దాక్కుని వున్న బహద్దూర్ షా కొడుకు లిద్దరినీ పసిగట్టిన మేజర్ హడ్సన్, వాళ్ళను పట్టుకుని, వివస్త్రలుగా చేసి, భయభ్రాంతులై వున్న ప్రజల సమక్షంలో నిర్దాక్షిణ్యంగా స్వయంగా కాల్చి చంపాడు.



బహద్దూర్ షా రంగూన్‌కు తరలించబడి
అక్కడే 1862వ సంవత్సరంలో ఖైదీ
గానే మరణించాడు. అతనితో మొగల్
సామ్రాజ్యం అంతరించింది. ఆఖరికి
మిగిలిన అతడి కొడుకు లిద్దరూ
పేదరికంతో అలమటించారు.

సిపాయిల తిరుగుబాటు విఫలమయిన
తర్వాత, కంపెనీ సైనికులు, భారతీ
యులపై పగబట్టి హింసించసాగారు.
అమాయకులైన గ్రామ ప్రజలను చంపి
చెట్లకు వేలాడదీశారు. కాల్చి చంపారు.
లెక్కలేనన్ని గ్రామాలను తగులబెట్టారు.






భారతదేశంలో కంపెనీ పాలన గురించి,
ఇంగ్లాండులోనే విమర్శలు బయలు
దేరాయి. భారతదేశ పరిపాలనాధి
కారాన్ని విక్టోరియారాణి పేరు మీదుగా
తనే చేపట్టాలని బ్రిటిష్ ప్రభుత్వం
నిర్ణయించింది. విక్టోరియారాణి
'కైజార్-ఇ-హింద్', బిరుదును స్వీక
రించవలసి వచ్చింది.

కంపెనీ చేత నియమించబడిన గవర్నర్ జనరల్ ఇప్పుడు వైస్రాయ్ (రాణి ప్రతినిధి) అయ్యాడు. 1858వ సంవత్సరం నవంబర్ ఒకటోతారీఖున అలహాబాదులో సభజరిపి, వైస్రాయ్ కానింగ్ ప్రభువు అధికార మార్పిడిని ప్రకటించాడు.





ఆ తరవాత పరిపాలనా వ్యవహారాలలో అనేక మార్పులు ప్రవేశపెట్టబడ్డాయి. కలకత్తా, మద్రాసు, బొంబాయి పట్టణాలలో ఉన్నత న్యాయస్థానాలు నెలకొల్పబడ్డాయి. విద్యకు ప్రముఖ స్థానం ఇవ్వబడింది. విద్యావ్యాప్తికోసం వివిధ ప్రాంతాలలో విద్యాశాఖలు ఏర్పాటు చేయబడ్డాయి.

1880వ సంవత్సరం రిప్పన్ ప్రభువు కొత్త వైస్రాయ్‌గా వచ్చాడు. ఆయన మంచి మనసూ, ఆదర్శభావాలూ గల సంస్కర్త. ఆయన వచ్చిన తర్వాతే, ప్రాంతీయ సంఘాలు, పురపాలక సంఘాలు ఏర్పాటు చేయబడ్డాయి. పరిపాలనా వ్యవహారాలలో భారతీయులకు కూడా కొన్ని చిన్న చిన్న హక్కులు ఇవ్వబడ్డాయి.





అంతకు పూర్వం నిందితుడైన అంగ్లేయునిపై విచారణ జరిపే అధికారం భారతీయ న్యాయమూర్తులకు వుండేది కాదు. ఈ పక్షపాతవైఖరి రిప్పన్ ప్రభువుకు నచ్చలేదు. ఆయన బ్రిటిష్ న్యాయమూర్తులకూ, భారతీయ న్యాయమూర్తులకూ సమానమైన హక్కులు ఇవ్వడానికి నిశ్చయించాడు. ఈ నిర్ణయం భారతదేశంలోని అంగ్లేయులకు కోపకారణమయింది.

విరక్తి చెందిన రిప్పన్ ప్రభువు తన పదవికి రాజీనామా చేసి, ఇంగ్లండుకు బయలుదేరాడు. ఆయనలోని నిజాయితీకి, స్నేహభావానికి అనందించిన భారతీయులు, ఆయనకు ఘనంగా వీడ్కోలు పలికారు. ఆ తర్వాత భారతీయులు, ఒక జాతీయ సంస్థను స్థాపించవలసిన అవసరాన్ని క్రమంగా గ్రహించసాగారు.





**1885** వ సంవత్సరంలో భారత జాతీయ కాంగ్రెస్ స్థాపించబడింది. కాంగ్రెస్ ప్రథమ మహాసభ—కలకత్తాకు చెందిన సుప్రసిద్ధ న్యాయవాది అయిన డబ్ల్యు. సి. బెనర్జీ అధ్యక్షతన బొంబాయిలో సమావేశమయింది. పదవీవిరమణ చేసిన బ్రిటిష్ అధికారి అలన్ అక్టావియన్ హ్యూమ్—జాతీయ కాంగ్రెస్ అవిర్భావానికి ఎంతో ప్రేరణ కల్గించాడు.



# పాడుపడిన పూరిగుడిసె

అనంగరాజ్యాన్ని పూర్వం ఒకప్పుడు చక్రధర మహారాజు ఏలుతూ వుండేవాడు. ఆయన నివసించే రాజభవనం ఏడుతరాల కిందట నిర్మించింది. పూర్వులు ఆ భవనాన్ని ఏనాడు నిర్మించారో, అంతే. మళ్ళీ అది మరమ్మతు అనే మాటే ఎరుగదు.

రానురాను ఆ రాజభవనం శిథిలమైపోయి, కంటితో చూడటానికే అసహ్యం వేసే స్థితికి వచ్చింది. ఇంతకాలమైన తరవాత ఇప్పుడు మరమ్మతు మాట తలపెట్టినట్టయితే, అది అయేపని కాదని చక్రధర మహారాజు ఉపేక్షచేసి వూరుకొన్నాడు.

కాని, చూడగా చూడగా, చక్రధరునికి ఈ సమస్య వెగటు పుట్టించింది. ఇక ఒక్క నిమిషమైనా ఆ భవనంలో నిలవటం రోత అనిపించింది. పైగా ఎక్కడైనా మనసుకు ఆహ్లాదకరమైన స్థలం చూసుకొని నివాసం ఏర్పరుచుకోవాలని బుద్ధి పుట్టింది.

ఈ సంకల్పం కలిగిన వెంటనే చక్రధరమహారాజు క్షణమైనా ఆ భవనంలో నిలవలేదు. పరివారాన్ని తీసుకొని బయలుదేరాడు. పోయిపోయి, ఒక నదీ తీరం చేరుకొన్నాడు.

నదీతీరమందు ఆయన పొందిన ఆనందం మాటలతో చెప్పటానికి అలవి కాదు. ఇక్కడికి రాగానే ఆయన శరీరమూ, మనస్సూ కూడా ఒక కొత్త జీవంతో ప్రకాశింపసాగినై. ఈ కారణం చేత రాజు నదీతీరానికి చేరువలోనే ఒక కొత్త భవనం నిర్మించాలని సంకల్పించి, ఈ ప్రదేశం ఎవరిదో ఏమిటో కనుక్కోమన్నాడు.

అక్కడనే, గుబురుగా పెరిగిన చెట్ల సందున ఏదో ఇల్లు కనిపించేసరికి



అందరూ కలిసి అక్కడికిపోయి చూశారు. అది ఒక చిన్న కుటీరం.

ఆ కుటీరం లోపల తొంభైఏళ్ల ముసలిది ఒకర్తె ఉన్నది. తన కుటీరం దగ్గరకు వచ్చిన ఆ జనం రాజూ, పరివారమూ అని తెలిసి, ఆమె చాలా సంతోషించింది. వారిని తగు మర్యాదలతో ఆదరించి, ''మీ రెందుకు బాబూ, ఇలా దయ చేశారు?'' అని అడిగింది.

అప్పుడు మంత్రి ఆమెతో, ''అవ్వా! ఇక్కడ మా ప్రభువులకు ఎంతో సుఖంగా వున్నదని సెలవిస్తున్నారు. రాజభవనం నిర్మించేటందుకు ఇక్కడ విశాలమైన స్థలం కావాలి. కనుక, దారిలో వున్న నీ కుటీరాన్ని తీసివేయవలసి ఉన్నది'' అని చెప్పాడు.

అందుకు ముసలిది ''అయ్యో, నా తండ్రీ! రాజావారు భవనం కట్టుకుంటా మంటే నే వద్దంటానా? అంతకంటే నాకు మాత్రం కావాల్సిందేమున్నది? అయితే, ఈ కుటీరం ఏడు తరాలనాడు మా పూర్వులు కట్టించింది. ఇప్పుడు నా తరం వచ్చేసరికి, నేను చితికిపోయి వుండటం చేత కానీ డబ్బు అయినా పెట్టి మరమ్మతు ఐనా చేయించలేక పోయాను. లేకపోతే పోయింది. నేను మట్టుకు ఈ పూరిపాక వదిలి పోలేను. ఎప్పటికైనా కాలంకలిసి వస్తే నేయించుకొంటా, లేకుంటే లేదు. కాని, ఈ స్థలం మాత్రం వదిలిపోలేను'' అని చెప్పింది.

అప్పుడు మంత్రి మళ్ళీ వృద్ధురాలితో, ''ముసలీ! సరే, నువు చెప్పిన మాట బాగానే వుంది. కాని, పిచ్చిపిచ్చి వూహలు పెట్టుకుని నేను ఇక్కడినుంచి కదలనూ, అంటే వీలుకాదు. అలా అనటం కేవలం మూర్ఖత అనిపించుకొంటుంది. ఈ కాస్త స్థలమూ వదిలేశావంటే, రాజావారు వారి రాజ్యంలో, నీకు ఎక్కడ కావలిస్తే అక్కడ అంతకు పదిరెట్లు విస్తీర్ణం గల స్థానం ఇస్తారు. లేదా, నాకు స్థలం అక్కరలేదు, డబ్బే కావాలి అంటావా

అలాగే కోరుకో. నీ యిష్టం వచ్చినంత ధనం యిప్పుడే తెప్పించి యిస్తాను," అన్నాడు.

అందుకు ముసలిది "నాయనా, నీ పెద్దపెద్ద స్థలాలూ నాకు వద్దు; నీ ధనపు రాసులూ నాకు పనిలేదు. లక్ష రానీ పోనీ, ఈ కుటీరంలోనించి మట్టుకు నేను కదల బోయేదిలేదు. రాజుగారికి కావాలంటేనే నా కుటీరం జోలికి రాకుండా, ఈ విశాల ప్రదేశంలో ఎక్కడైనా కట్టుకోమను భవనం" అని నిర్భయంగా చెప్పింది.

అప్పుడు పరివారం అందరూ ముసలి దానికేసి కోపంగా చూశారు. "మాట్లాడు తున్నది ఎవరితోనో ఒళ్ళు తెలియకుండా వుందే, దీనికి. దీని బతుకెంత, దీని పూరిపాక ఎంత? లాగి పారెయ్యండి" అంటూ మంత్రి మండి పడ్డాడు.

అప్పుడు మహారాజు వారందరినీ శాంత పరిచాడు. అవ్వ చెప్పిన మాటలను శ్రద్ధగా ఆలకించి, వాటిని సరీగా అర్థం చేసుకొన్నది మహారాజు ఒక్కడే. ఆమె చెప్పిన మాటలకు మహారాజు హృదయంలో గొప్ప సంచలనం కలిగింది.

అవ్వకు తన జన్మస్థలం మీద ఉండే అభిమానానికీ, ఆమెకు తన పూర్వీకుల మీద వుండే భక్తికీ ఆయన విస్తుపోయాడు. ఈ మాటలు విన్న తరువాత, తను తల



పెట్టిన పని ఎంతో తప్పిదంగా తోచింది. "ప్రాజ్ఞుడనూ, ప్రభువునూ అయివున్న నాకు ఈ ముసలిదానిపాటి కూడా ఆలోచన లేకపోయిందే" అని విచారించాడు.

మంత్రినీ, పరివారాన్నీ చేరబిలిచి "ఈ ముసలిది నాకు ఒక గొప్ప పాఠం నేర్పింది. నేను నా యిల్లు చక్కబెట్టు కొని, నా పూర్వీకుల గౌరవం నిల బెట్టాల్సింది—విధి. నా విధిని నేను మరిచాను. అదృష్టవశంచేత మనం ఇక్కడికి రావడంతో ఈ అవ్వ నా విధిని నాకు జ్ఞాపకం చేసింది.

"నేనిక నా రాజభవనానికి పోను. ఇక్కడనే ఈ చెట్ల కిందనేవుంటాను. ఇక్కడనే

వుండి నా రాజ భవనం మరమ్మతు చేయిస్తాను. నా పూర్వీకులు కట్టిన ఆ భవనాన్ని కలకల్లాడేటట్టు చేసి కాని, మళ్ళీ అందులో ప్రవేశించను,'' అని తన నిశ్చయం వెల్లడించాడు.

రాజు మాటలు పరివారంలో కొందరే గ్రహింపగలిగారు. తక్కినవారు ఆయనను పిచ్చివానిగా తలిచారు. ఆ క్షణం నుండి రాజు ఆ చెట్ల కిందనే బస యేర్పరచుకొని, చల్లని పిల్లవాయువులు అనుభవిస్తూ కాలక్షేపం చేయసాగాడు.

రాజు ఇక్కడ మకాం చేయగానే, నగరంలోని ప్రజలంతా ఇక్కడికే వచ్చేశారు. నివాసానికి ఇక్కడనే బాగా వున్నదని గ్రహించారు. రాజుతోపాటు అందరూ ఇక్కడ చెట్టు కిందనే చిన్న చిన్న కుటీరాలు వేసుకొని నివాసం ఏర్పరుచుకొన్నారు.

కొద్ది రోజులకల్లా ఆ ప్రదేశమే ఒక చక్కటి పట్టణంగా తయారయింది. ఐతే, ఇది పట్టణ లక్షణాలతో నిండిన పట్టణం కాదు, పల్లెటి లక్షణాలు గల పట్టణం అన్న మాట.

ఇక్కడ కొన్ని యిళ్ళు లేచినై. రాజ భవనమూ వెలిసింది. కొత్త కట్టడాలు ఎన్ని వెలిసినప్పటికీ, ఏడు తరాలనుండీ పడివున్న అవ్వ కుటీరాన్ని మట్టుకు రాజు కదపలేదు, ఎవరినీ కదపనీయలేదు.

తన కృతజ్ఞత తెల్పటానికని చక్రధర మహారాజు అవ్వ కుటీరం మరమ్మతు చేయించాడు. అంతేకాదు. ఆ చెట్ల కింద వెలసిన నగరానికి అవ్వ పేరు మీదుగా 'అవ్వాపురం' అని పేరు పెట్టాడు.

చక్రధర మహారాజు తన తరంలోనే దీక్షపట్టి అనంగరాజ్యంలోని తన పూర్వీకుల రాజభవనం బాగుచేయించాడు. అదీ కలకల్లాడుతూ ప్రకాశించింది.

అయితే, మహారాజు తన జీవితాంతం వరకూ రాచకార్యాలు అనంగరాజ్యంలోని తన పూర్వీకుల భవనంలో చూసుకొంటూ నివాసం మట్టుకు అవ్వాపురంలోనే పెట్టుకొన్నాడు.






సీతాపురానికి ఒక మంత్రగాడు వచ్చాడు. వాడు తన మంత్ర విద్యతో, ఏ రహస్యాన్నయినా తెలుసుకోగలనని ప్రగల్భాలు ప్రారంభించాడు. వాడి దగ్గిరకు ఎందరో వెళ్ళారు. అందర్నీ వాడు తెలివిగా నమ్మించి, ప్రతిఫలంగా బోలెడు డబ్బు సంపాయించాడు. ఆ ఊళ్ళోని కనకయ్యకు మాత్రం, మంత్రగాడి మీద అంతగా నమ్మకం కుదరలేదు.

ఒకనాడు ఊరి షాహుకారు లక్షశెట్టి, కనకయ్య దగ్గిరకు వచ్చి, "మంత్రగాడు నాకు పెద్ద ఉపకారం చేశాడు. అందుకు ప్రతిఫలంగా నేను, వాడికి నూరు వరహాలివ్వబోతున్నాను. వాడు మోసకారి అని నువ్వు రుజువుచేస్తే, నేనా డబ్బు వాడికి యిచ్చుకోనక్కర్లేదు," అన్నాడు.

కనకయ్య కొంచెం సేపు ఆలోచించి, "ఊరు ఊరంతా వాణ్ణి నమ్ముతున్నది. అందరూ వాడికి పెద్ద మొత్తాల్లో కానుకలిస్తున్నారు. అలాంటప్పుడు, వాడి మోసాన్ని ఎలా బయటపెట్టాలా అని ఆలోచిస్తున్నాను," అన్నాడు.

లక్షశెట్టి ఒక క్షణం ఆగి, ఏదో ఉపాయం తోచినవాడిలా ముఖం పెట్టి, "ఒక పని చెయ్యి. పది రోజుల క్రితం నీవి వంద వరహాలు పోయాయని చెప్పి, నా బాకీ వచ్చే పంటకాలానికి వాయిదా వేశావు. ఇప్పుడు మంత్రగాడి దగ్గిరకు వెళ్ళి, ఆ డబ్బు ఏమయిందో చెప్పమను. వాడు చెప్పగలిగితే, ఆ డబ్బు తెచ్చి నాకిచ్చెయ్యి. అదే నేను మంత్రగాడికిచ్చుకుంటాను," అన్నాడు.

"మంత్రగాడు చెప్పలేకపోతే?" అని అడిగాడు కనకయ్య.

"అప్పుడు నువ్వు నా కివ్వవలసిన నూరు వరహాల బాకీ వదులుకుంటాను.

జొన్నలగడ్డ రామలక్ష్మి

మంత్రగాడు పట్టి మోసకారి అని తేలిం తర్వాత, నేను వాడికి డబ్బు యివ్వవ వసరం లేదు కదా! నీ బాకీ నూరు వర హాలు చెల్లుబడిపోయినట్టే,'' అన్నాడు లక్షశెట్టి.

లక్షశెట్టి తెలివికి కనకయ్య ఆశ్చర్య పోయాడు. చాలా తెలివిగా తన నుంచి బాకీ వసూలు చేయాలనుకుంటున్నాడు, లక్షశెట్టి!

''సరే, పద!'' అన్నాడు కనకయ్య.

ఇద్దరూ కలిసి మంత్రగాడి దగ్గిరకు వెళ్ళారు. ఆ సమయంలో వాడి దగ్గిర చాలామంది జనం వున్నారు. మంత్రగాడు నల్లటి పొడవాటి అంగీ ధరించి, జింక చర్మంపై పద్మాసనం వేసుకుని కూర్చు న్నాడు. వాడిముందు బాగా ముదురు రంగుల్లో వేసిన ముగ్గు వున్నది. దాని మధ్య రెండు అస్థికలూ, ఒక కపాలం వున్నవి. కళ్ళు మూసుకుని వాడేదో మంత్రోచ్చారణ చేస్తూ, మధ్య మధ్య గట్టిగా పళ్ళు కొరుకుతున్నాడు.

కనకయ్య వంగి వాడికి నమస్కారం చేసి, ''స్వామీ, నాదొక చిన్న కోరిక! ఆ కోరిక మీరు తీర్చినా, ప్రతిఫలంగా ఏమీ యిచ్చుకోలేని పేదవాణ్ణి,'' అన్నాడు.

మంత్రగాడు కళ్ళు తెరిచి, ''భక్తులు ఆనందంతో డబ్బిస్తేనే తీసుకుంటుంది, దేవి! నీవంటివాళ్ళకు, నిస్వార్థంగా సేవ చెయ్యమని, దేవి ఆజ్ఞ. నీ కోరిక చెప్పుకో,'' అన్నాడు.



"పది రోజుల క్రితం నావి నూరు వరహాలు పోయినై. మూటగా కట్టి గదిలో దాచిన డబ్బు పోయింది. ఊరివాళ్ళంతా మిమ్మల్ని నమ్ముతున్నా, నాకు నమ్మకం లేక మీ దగ్గిరకు రాలేదు. ఈ రోజు లక్ష శెట్టి, నన్ను బలవంతపెట్టి యిక్కడికి తీసుకువచ్చాడు. ఆ డబ్బు ఎవరు దొంగిలించారో చెప్పి, ఆ మొత్తం నాకు తిరిగి వచ్చేలా చేయమని, నా కోరిక!" అన్నాడు కనకయ్య.

మంత్రగాడు కళ్ళు మూసుకుని ఆలోచనలో పడ్డాడు. కనకయ్య అన్నవాడొకడు తనను నమ్మడం లేదని, వాడికి చాలా కాలంగా తెలుసు. వాడు కూడా తన బుట్టలోపడ్డాడంటే, యిక తనకు ఊళ్ళో తిరుగంటూ వుండదు. చుట్టుపక్కల ఊళ్ళల్లో కూడా తన పేరు ప్రతిష్ఠలు పెరుగుతాయి. అందువల్ల, ఏదో విధంగా వాడికి తను సాయపడాలి!

ఇలా ఆలోచించి మంత్రగాడు కొద్ది సేపటి తరవాత కళ్ళు తెరిచి, "ఆహాఁ, తెలిసింది!" అన్నాడు గంభీరంగా.

"డబ్బు ఎవరు తీశారు, స్వామీ?" అన్నాడు కనకయ్య వినయంగా.

"నీకు బాగా కావలసినవాడే తీశాడు. కాని, వాడి పేరు చెప్పను. ఎందుకంటే, డబ్బు పాపిష్టిది. నీవు అజాగ్రత్తగా దాన్ని నలుగురి కంటపడేలా పెట్టావు. వాడు దాన్ని చూసి మనసు చలించి ఎత్తుకు పోయాడు. మొదటి తప్పును క్షమించమని,





దేవి ఆన! ఈ రాత్రి వాడు ఆ వంద వరహాలూ తెచ్చి, నాకిస్తాడు. అర్ధరాత్రి లోగా తెచ్చి యివ్వకపోతే, వాడిపై మంత్ర ప్రయోగం చేసి, నోరు పడిపోయేలా చేస్తాను. అంతేకాదు, అలా ఇవ్వకపోతే వాడి పేరు నీకు చెప్పేస్తాను. నువ్వు, రేపు యిదే సమయానికి వచ్చి, డబ్బు తీసుకుపో,'' అన్నాడు మంత్రగాడు.

కనకయ్య ఎంతో వినయంగా మంత్రగాడికి మరొకసారి నమస్కరించి వెళ్ళిపోయాడు.

తన మాటలకు బెదిరిపోయి, దొంగ తనకు డబ్బు తెచ్చి యివ్వడం జరుగుతుందని, మంత్రగాడు ఆశించాడు. కాని, అలా జరగలేదు. అంటే, తన మంత్ర శక్తికి, ఆ దొంగ భయపడలేదన్నమాట! ఇది తెలిస్తే, ప్రజలకు తనపై విశ్వాసం పోతుంది. అందువల్ల, తన దగ్గిర చేరిన డబ్బులో, నూరు వరహాలు కనకయ్య కివ్వడం మంచిదని, మంత్రగాడు నిర్ణయించుకున్నాడు.

మర్నాడు కనకయ్య, తన దగ్గిరకు రాగానే మంత్రగాడు, ''ఓయీ, దేవి కృప అపారం! ఇకముందు నీ డబ్బు విషయంలో జాగ్రత్తగా వుండు. అజాగ్రత్తగా వుండేవాళ్ళకు, దేవి సాయపడదు. రాత్రి దొంగ నుంచి నాకు డబ్బు అందింది, ఇదుగో తీసుకో!'' అంటూ కనకయ్యకు చిన్న మూట అందించాడు.

కనకయ్య డబ్బు లెక్కపెట్టుకుని చూశాడు. అందులో సరిగా నూరు వరహాలున్నవి.

''మహాప్రసాదం, స్వామీ!'' అంటూ కనకయ్య మంత్రగాడి పాదాలకు మొక్కి, అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

లక్షశెట్టి మంత్రగాడి కివ్వాలనుకున్న నూరు వరహాలూ యిచ్చేసి, బాకీ వసూలు చేసుకునేందుకు కనకయ్య యింటికి వెళ్ళాడు.

''నేను యింకా నీకు బాకీ ఏమిటి? మంత్రగాడికి మంత్రశక్తి లేదని రుజువు

చేయగానే అది తీరిపోయింది గదా!'' అన్నాడు కనకయ్య.

''నువ్వు, మంత్రగాడికి మంత్రశక్తి లేదని రుజువు చెయ్యడమేమిటి? వాడు పోయిన నీ డబ్బు తెప్పించి యిచ్చాడు గదా!'' అన్నాడు లక్షశెట్టి చిరుకోపంగా.

''నిజంగా నా డబ్బు పోయివుంటే, వాడి మంత్రశక్తిని నమ్మి వుండేవాడిని.'' అన్నాడు కనకయ్య.

''నువ్వు చెప్పేదేమిటో, నాకు అర్థం కావడం లేదు,'' అన్నాడు లక్షశెట్టి అయోమయంగా.

''సమయానికి నీ బాధ వదుల్చుకునేందుకు, నేను వంద వరహాలు పోయినై అని అబద్ధం చెప్పాను. ఆ మాత్రం నిజం తెలుసుకోలేని మంత్రగాడు, నాకు వాడి డబ్బు యిచ్చి తన పరువు నిలబెట్టుకున్నాడు,'' అన్నాడు కనకయ్య.

''అయితే, యీ విషయం పదిమంది ముందూ ఎందుకు బయటపెట్టలేదు?'' అని ప్రశ్నించాడు లక్షశెట్టి.

''ఎందుకేమిటి? ప్రజలు మూర్ఖులు. వాళ్ళు మంత్రగాడిని గుడ్డిగా నమ్ముతున్నారు. జరిగింది చెబితే, నేనే కావాలని అబద్ధం చెప్పాననుకుని, వాళ్ళు నన్ను తన్నడానికి వస్తారు. అయినా, తెలివితేటలున్నవాడెవడూ మంత్రగాళ్ళను నమ్మడు. తెలివితేటలు లేనివాళ్ళకు నిజం చెప్పడం ప్రమాదం,'' అన్నాడు కనకయ్య.

''పదిమంది ముందూ, నువ్వు నిజాన్ని చెప్పవలసింది. జనం తన్నకుండా నేను, నిన్ను కాపాడి వుండేవాణ్ణి,'' అన్నాడు శెట్టి.

''ఓహోఁ, యిది మహబావుంది! మంత్రగాడి పేరు పోవడం కంటే, నాకు పరువు నిలుపుకోవడం ముఖ్యం. షావుకారుకు బాకీ తీర్చలేక, డబ్బు పోయిందని అబద్ధాలు చెప్పే గుణం కనకయ్యకున్నదని, అందరికీ తెలిసిపోతే—పదిమంది మధ్యా నా పరువేమైపోతుంది?'' అన్నాడు కనకయ్య.

చేసేదిలేక లక్షశెట్టి తెల్లమొహం వేసుకుని, అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.





# రంగరాజు వీలునామా

గంగవరంలో రంగరాజు అనే ధనికుడున్నాడు. ఆయనకు వృద్ధాప్యం రావడం వల్ల క్రమంగా కంటిచూపు మందగించడమే కాక, పిడుగులుపడుతున్నా పిసరంతైనా వినిపించని బ్రహ్మచెముడు కూడా దాపురించింది.

ఆయన ఒకనాడు పెద్ద కొడుకు పార్వతీశాన్ని పిలిచి, "నాయనా, బతికినన్నాళ్ళూ, ఏ అవయవలోపం లేకుండా బతకాలని, నా కోరిక. గుడ్డివాడుగా నేను కన్ను మూయకుండా, నాకు చూపు వచ్చేలాగా ఏదయినా వైద్యం చేయించరాదా?" అన్నాడు.

పార్వతీశం తండ్రి కోర్కెను తేలిగ్గా కొట్టివేస్తూ, "నాన్నా, నీకు కళ్లు కనబడకపోవడం వల్ల కలిగేనష్టమేముంది? నిన్ను చూసుకునేందుకు నేనూ, నీ కోడలూ, మనమలూ సరిపోమా!" అన్నాడు.

కాని, రంగరాజు వైద్యం చేయించి తీరాలని పట్టుపట్టాడు. పార్వతీశం ఊళ్ళోనే వున్న నాటువైద్యుణ్ణి పిలిపించి, తండ్రికి వైద్యం చెయ్యమన్నాడు. రంగరాజు అదృష్టమో, నాటువైద్యుడి చేతి చలవో కాని, కొద్ది రోజుల్లోనే రంగరాజుకు బాగా చూపు వచ్చింది.

తనకు శ్రద్ధగా వైద్యం చేయించినందుకు ఆయన కొడుకును మెచ్చుకున్నాడు.

ఇది చూసిన రంగరాజు చిన్న కోడలు భర్తతో, "ఏమండీ, మీ అన్న కారణంగా తన కళ్ళు రెండూ బాగుపడ్డాయని, మీ నాన్న మురిసిపోతున్నాడు. ఆయన మెప్పు సంపాయించడం మనకూ అవసరం అన్న సంగతి, మీకు, తెలియకపోవడం, ఆశ్చర్యంగా వున్నది." అన్నది.

చిన్న కొడుకు చిదంబరం, "అవును, బాగా గుర్తు చేశావు!" అని, ఆ మర్నాడే

కమలిని

పట్టణానికి వెళ్ళి, పేరుమోసిన వైద్యు డొకాయనను తీసుకువచ్చాడు.

ఈ వైద్యుడు రంగరాజు ఇంట్లోనే వుంటూ, కొద్ది రోజుల్లోనే ఆయనకు చెవుడు పోయేలా మంచి చికిత్స చేశాడు. చిన్న కొడుకు తనపట్ల చూపిన శ్రద్ధకు, రంగరాజు చాలా ఆనందించాడు.

కొంతకాలం గడిచాక రంగరాజు, తన తదనంతరం ఆస్తి ఎవరికి చెందాలో వివరంగా రాయించిన వీలునామా, కొడుకు లిద్దరికీ చూపించాడు.

ఆ వీలునామా చదివిన అన్నదమ్ములకు మతి పోయినంత పనయింది. రంగరాజు తనకున్న ఆస్తి అంతా ఊళ్ళోని ధర్మ సత్రానికి రాసేశాడు.

తండ్రితో వాదించి లాభం లేదని, అన్న దమ్ములు ఊళ్లోని పెద్ద మనుషులకు సంగతి చెప్పి, "మా నాన్న ఎందుకనో ఆస్తి మాకు దక్కకుండా చేస్తున్నాడు. ఇది అన్యాయం! మీరు ఆయనతోమాట్లాడి, న్యాయం జరిగేలా చూడాలి." అన్నారు.

పెద్ద మనుషులు రంగరాజు దగ్గిరకు వచ్చారు. వాళ్ళల్లో ఒకాయన రంగ రాజుతో, "నువ్వు చేసిన పని ఏం బాగా లేదు. పంచేంద్రియాలు పట్టుదప్పకుండా మనిషి కాలం చేయడం కన్న అదృష్ట మేముంటుంది! నీ కొడుకు లిద్దరూ, నీకు వినిపించని మాటనూ, పోయిన చూపునూ తిరిగి వచ్చేలా చేశారు. అలాంటివాళ్ళకు, నువ్వు ఆస్తిలో చిల్లిగవ్వ దక్కకుండా



చేయడం దురన్యాయం. దీన్ని ఎవరూ మెచ్చరు," అన్నాడు.

రంగరాజు నవ్వి, "కళ్ళు బాగు చేయించి పెద్ద కొడుకూ, చెవుడు పోగొట్టి చిన్న కొడుకూ—నిజంగానే నాకు ఎంతో మేలు చేశారు. అందువల్ల, నేనిప్పుడు యింట్లో జరుగుతున్న గొడవలన్నీ చూడడమే కాక, వినగలుగుతున్నాను. ఆస్తిని ధర్మకార్యాలకు వినియోగించడం వల్ల కలిగే ప్రయోజనం, నా కొడుకుల కిచ్చినందువల్ల కలగదని, నా కర్థమైంది," అన్నాడు.

ఆ జవాబుతో రంగరాజుకు, కొడుకుల పట్ల ఏదో అసంతృప్తి వున్నదని, వచ్చిన పెద్దమనుషులు గ్రహించారు. వాళ్ళు పార్వతీశాన్నీ, చిదంబరాన్నీ "విన్నారు గదా! ఏమంటారు?" అని అడిగారు.

పార్వతీశం, చిదంబరం సిగ్గుతో తలలు వంచుకున్నారు.

రంగరాజు వాళ్ళతో, "బాధపడకండి. తల్లిదండ్రులు మిగిల్చి యివ్వబోయే ఆస్తి కోసం పిల్లలు, వాళ్ళను ముసలితనంలో ఆదుకోవడం సర్వసాధారణంగా జరుగుతున్నదే. కాని, అది నిజమైన ప్రేమ అనిపించుకోదు. ఈ సంగతి మీకు అర్థమయేలా చేసేందుకే, యీ వీలునామా వ్యవహారం సృష్టించాను," అన్నాడు.

అందరూ రంగరాజు కేసి ఆశ్చర్యంగా చూశారు.

ఆయన కొడుకులకేసి ఆప్యాయంగా చూస్తూ, "నేను పోరుపెట్టకుండానే, మీకై మీరు, నా కళ్ళకూ, చెవుడుకూ చికిత్స చేయించివుంటే చాలా సంతోషించేవాణ్ణి. అలా మీరు చేయలేదు. ఈ వీలునామా, మీకొక గుణపాఠం నేర్పి వుండాలి. నిజానికి నేను సంపాదించిన ఆస్తి, నా కొడుకులూ, మనమలూ అనుభవించడం కన్నా, నాకు వేరే తృప్తి ఏముంటుంది!" అన్నాడు.

ఆ మాటలతో, వచ్చిన పెద్ద మనుషులూ, రంగరాజు కొడుకులూ తృప్తిగా తలలాడించారు.





# విష్ణు కథ

సూతమహర్షి దశావతారాల్లో తొమ్మిదవది అయిన బుద్ధావతారం గురించి చెప్పడానికి ఉపక్రమించాడు:

కలియుగం బాగా పెరిగింది.

మానవత్వం నుంచి క్రూరమృగత్వంలోకి మానవులందరూ దిగజారిపోతూన్న దశ వచ్చింది. మనిషి బుద్ధిని సక్రమ మార్గాన పెట్టుకొని తన్నుతాను ఉద్ధరించుకోవలసిన అవసరం ఏర్పడింది.

అంతకుముందు యుగాల్లో ఎవడో దుష్ట దానవుణ్ణి సంహరించడానికి విష్ణువు అవతారం ఎత్తి ఆ పని నిర్వహించే తరుణం దాటిపోయింది.

మనుషులందరూ రాక్షసులుగా ఒకరినొకరు దోచుకొంటూ, హింసించుకొంటూ, యజ్ఞయాగాదుల పేరుచెప్పి దయకుచోటు లేకుండా జీవహింసనే పరమావధిగా, మద్యమాంస భుక్కులై, భోగపరాయణులై— మానవుడు బుద్ధిజీవి అనే సత్యాన్ని తెలుసుకోలేని పామరత విశృంఖలంగా చెలరేగిపోయింది. తత్ఫలితంగా మానవుల బాధలూ, యాతనలూ పెరిగాయి.

మనిషిగాపుట్టి పరిపూర్ణ మానవుడిగా, ఎటువంటి దైవికస్పర్శ అంటని బుద్ధమూర్తిగా, తోటి మానవులందర్నీ ఉద్ధరించగల కాలానుగుణ్యమైన ధర్మసంస్థాపన చేయవలసిన అవసరం విష్ణువుకు వచ్చింది.

నేపాళదేశంలోని కపిలవస్తు నగరాన్ని, శాక్యవంశానికి చెందిన శుద్ధోదన మహా

21. బుద్ధావతారం



చనిపోయి, శుద్ధోదనుడిని దుఃఖసాగరంలో ముంచింది.

మాతృవిహీనుడైన కుమారుణ్ణి మహారాజు కంటిని రెప్ప లాగ కాపాడుకొంటూ, నామకరణ మహోత్సవం చేయించాడు. గౌతమసిద్ధార్థుడు అని పిల్లవానికి నామకరణం జరిగింది. సిద్ధార్థుడు శుద్ధోదనుడి కన్నులపండుగగా చంద్రుడి లాగ పెరుగుతున్నాడు.

తరువాత దైవజ్ఞులు సిద్ధార్థరాకుమారుడి జాతకాన్ని పరిశీలించారు. "మహారాజా! రాకుమారుడు చక్రవర్తి అవుతాడు. ఈ విశాల ప్రపంచంలోని రాజాధిరాజులు, ప్రజలు అతనికి తలలు వంచి అంజలులు ఘటిస్తారు...." అని చెపుతూవుంటే శుద్ధోదనుడి ఆనందానికి మేరలేకపోయింది.

".....కాని.....మహారాజా! రాకుమారుడికి సన్యాసయోగం ఉన్నది!" అన్నారు జ్యోతిషవేత్తలు.

శుద్ధోదనుడికి గుండెలో రాయిపడ్డది. అంతా అయోమయంగా తోచింది. "చక్రవర్తి అవుతాడంటూనే, సన్యాసయోగం తప్పదని అంటున్నారేమిటి?" అని రెట్టించి అడిగాడు.

పండితులు రాకుమారుడి జాతకచక్రంలోని గ్రహగతులను సూక్ష్మపరిశీలన చేసి రాజుతో, "రాజా! రాకుమారుడు అతి సుకు

రాజు పాలిస్తున్నాడు. అతని రాణి మాయాదేవి పూర్ణిమ చంద్రబింబం లాగ ప్రకాశిస్తున్న తెల్లని ఏనుగు, ఆకాశం నుండి దిగి, ఆమెలో ప్రవేశించినట్లు అద్భుతమైన కల గన్నది. ఒక మహాపురుషుడు మహారాణికి ఉదయించబోతున్నాడని పండితులు మహారాజుకు, ఆ కల ఫలితాన్ని చెప్పారు.

కొన్నాళ్ళకు మాయాదేవి పల్లకీలో పుట్టినింటికి వెళ్తూ, దారిలో ఒక వనంలో పిల్లవాణ్ణి ప్రసవించింది. ఆ రోజు వైశాఖ పూర్ణిమ.

కుమారుడు కలిగిన ఆనందం ఎన్నాళ్ళో మిగలకుండా, మాయాదేవి కొద్ది దినాలకే

మారమైన మనస్సు గలవాడై వుంటాడు. ముఖ్యంగా అతడు నాలుగు దృశ్యాలను చూడకూడదు. అవి రోగము, వృద్ధాప్యము, మృత్యువు, సన్యాసము! వీటిని చూసిన మరు క్షణమే రాకుమారుడి మనస్సు విరిగిపోతుంది కనుక, తగిన జాగ్రత్తలు తీసుకోవలసి ఉన్నది!'' అని చెప్పారు.

సిద్ధార్థుడికి పసితనం నుంచీ ఎటువంటి చింత కలగకుండా ఎల్లప్పుడూ అహ్లాద కరంగా ఉండేలాగ, ఆటపాటలను, వినోదాలను ఏర్పాటు చేసి ఎంతో శ్రద్ధగా తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకున్నాడు శుద్ధోదనుడు.




సిద్ధార్థుడు ఒకనాడు ఉద్యానవనంలో వేదికపై సుఖాసీనుడై ఉండగా, ఒక హంస గిలగిల తన్నుకుంటూ అతని ఒడిలో పడింది. రాకుమారుడు దానికి గుచ్చుకొన్న బాణాన్ని జాగ్రత్తగా తొలగించి, ఆకుపసరు పూసి దాని ప్రాణాన్ని కాపాడాడు.

''ఆ హంస నాది, దాన్ని నేను కొట్టాను!'' అని బిగ్గరగా అంటూ దేవదత్తుడు వచ్చాడు. దేవదత్తుడు సిద్ధార్థుడికి జ్ఞాతిసోదరుడు.

''ఈ హంస ప్రాణాన్ని నేను కాపాడాను. ఇది నాదే,'' అన్నాడు సిద్ధార్థుడు.

ఇద్దరూ రాజసభకు వెళ్ళారు. ధర్మ శాస్త్రవేత్తలు, ''ప్రాణరక్షకుడైన రాకుమారుడిదే హంస!'' అని ఏకగ్రీవంగా తీర్పు యిచ్చారు.

ఆ కారణంగా బాల్యంనుంచే దేవదత్తుడికి సిద్ధార్థ రాకుమారుడి మీద అసూయ, స్పర్థ ఏర్పడింది.

శాక్యులు సుక్షత్రియ ఆయుధోపజీవులు. వేట వారికి అత్యంతప్రీతి. కాని రాకుమారుడికి వేట అంటే అయిష్టం. విలువిద్య, లక్ష్యసిద్ధి బాగా నేర్చి, అసమానుడనిపించుకొన్నప్పటికీ జంతువులను చంపడమన్నా, హింసించడమన్నా అతనికి తగని పనిగా ఉండేది.



వేటకు వెళ్ళడు. వినోదాల మీద ఆసక్తి చూపడు. హింసను చూసి తల్లడిల్లి పోతాడు. కుమారుడిలో రక్తానికి బదులు కరుణ ప్రవహిస్తున్నదా అని శుద్ధోదనుడు అనుకుంటూ, సాటి రాకుమారుల్లాగ, యువరాజుల్లాగ సిద్ధార్థుడు తయారవడానికి ఎన్ని ప్రయత్నాలు చేయాలో అన్నీ చేస్తున్నాడు.

రాకుమారుడు నగరంలోకి బయలుదేరినప్పుడెక్కడా దరిదాపుల్లో రోగపీడితులు, ముదివగ్గులు, మృతజీవులు, పరివ్రాజక, సన్యాస, బిక్షువులు కనపడకుండా ముందు జాగ్రత్తలు తీసుకున్న అనంతరమే, రథసారథి చెన్నుడు రాకుమారుణ్ణి రథం ఎక్కించుకొని నగరంలోకి తీసుకెళ్ళేవాడు.

సిద్ధార్థుడు తరుణ వయస్కుడయ్యాడు. సత్యప్రియత్వము, తార్కికదృష్టి, హేతుబద్ధమైన జ్ఞానము అతనిలో పెరిగాయి. అప్పుడే భూమికి దిగివచ్చిన ఏ దేవ సుందరుడో అన్నట్లుగా వుండేవాడు. కాని వినోద విలాసాల రాజభోగాలపై, అతని మనసు పోయేదికాదు.

శుద్ధోదన మహారాజు కుమారుడి ధోరణికి మరింత వ్యాకులపడ్డాడు. వివాహితుడు కావలసిన తరుణమూ వచ్చింది. వివాహమైతే మారతాడని, రాజ్యంలోని క్షత్రియ వంశాలకు చెందిన అందమైన కన్యలందర్నీ, రాజమందిరానికి ఆహ్వానించి రప్పించాడు.

రాకుమారుడి చూపు వారిపై పడడానికి ఏర్పాటు చేయబడిన అంతఃపుర మందిరంలో కొందరు తమ నృత్యగానాలను ప్రదర్శించారు. యువరాజు మనసు దోచుకోడానికి ఒకరిని మించి ఒకరు వయ్యారాలు ఒలికిస్తూ కన్యామణులు రాకుమారుడి దృష్టి ఎవరి మీద నిలుస్తుందో ఆ భాగ్యానికి తహతహలాడుతున్నారు.

వచ్చిన కన్యలను కానుకలతో సత్కరించడానికి, పళ్ళెరాల నిండా మణిహారాలు, మంచి ముత్యాల కోవలు, స్వర్ణ

భూషణాలు నిండుగా అమర్చి వున్నాయి. సుందరీమణులు ఒక్కొక్కరే ఓర చూపులు చూస్తూ వచ్చి సిద్ధార్థుడు అందించే బహూకృతులను అందుకొని వెళ్తున్నారు.




వచ్చిన వారంతా కానుకలు అందుకొని వెళ్ళిపోతున్నారు. సిద్ధార్థుడు ఆసనం నుండి లేచి వెళ్తూండగా ముగ్ధ మనోహర మూర్తి అయిన ఒక జవ్వని స్తంభం చాటున అతనికి కనిపించింది. స్తంభాన్ని అనుకొని తలవంచుకుని నిల్చున్న ఆమెలో సౌందర్యాన్ని మించిన సౌందర్యమేదో సిద్ధార్థుడికి కనిపించింది. ఆమె ప్రశాంత వదనంలో నిండైన సౌజన్యం వెల్లివిరుస్తున్నది. ఆమె యశోధర. ఒక సామంతుని కుమార్తె.

ఆమెకు యివ్వడానికి, ఏ ఒక్క కానుక కూడా మిగలలేదు. సిద్ధార్థుడు తన మెడనున్న పచ్చల హారాన్ని తీసి ఆమె నెన్నడుము చుట్టూరా చుట్టాడు. అతని కంఠానికి అంటిపెట్టుకున్న హారం ఆమె నడుముకు ఒదులుగా సరిపోయింది.

సిద్ధార్థుడికి యశోధరపై అనురాగం అంకురించింది, మనస్సు లగ్నమైంది. ఆ విషయం మహారాజుకి తెలిసింది.

సిద్ధార్థరాగోదయానికి శుద్ధోదన మహారాజు ఆనందభరితుడై సామంతునికి వియ్యమందబోతున్నట్లు వర్తమానం పంపాడు.

దేవదత్తుడు స్వయంవరం చాటించి పోటీ పరీక్షలు పెట్టాలని పట్టుపట్టాడు. యశోధర తండ్రి, కుమార్తె స్వయంవర పోటీకి అందరికీ ఆహ్వానాలు పంపాడు.

హింసకు తావివ్వని అనేక పోటీ ప్రదర్శనలు ఏర్పాటు కాబడ్డాయి. అనేక మంది యువకులు వచ్చారు. ఆ పరీక్షలన్నిటిలో రాకుమారుడు సిద్ధార్థుడే మిన్నగా నిలిచాడు. సిద్ధార్థుడితో సరిసమానంగా నెగ్గుతూ వచ్చిన దేవదత్తుడు ప్రతిద్వంద్విగా నిలబడ్డాడు. చివరకు దేవదత్తుడు కూడా ఓడిపోయాడు. సిద్ధార్థుడు




విలువిద్యలో, అశ్వారోహణలో, విద్యలన్నిటిలో అపూర్వ సామర్థ్యాన్ని చూపి యశోధర పాణికమలాన్ని గెల్చుకున్నాడు.

సిద్ధార్థ యశోధరల వివాహం వైభవోపేతంగా జరిగింది.

శుద్ధోదనుడికి కొంత మనశ్శాంతి లభించింది. కుమారుడు ఇంటివాడయ్యాడు. "సంసారచక్రంలో స్థిరపడి తప్పక చక్రవర్తి ఔతాడు!" అని అనుకుంటూ మైమరిచాడు.

యశోధర సిద్ధార్థుడికి అన్నివిధాలా తగిన భాగస్వామిని.

భర్తలో అసాధారణమైన మానవత్వపు విలువలు ఉన్నాయని ఆమె గ్రహించి, అందుకు అనుకూలంగా మనసులో మనసై మెసులుకొంటున్నది. వారి దాంపత్యం హాయిగా ఆనందప్రదంగా సాగుతున్నది.

సిద్ధార్థుడు వివాహమైన తరువాత అంతఃపురం విడిచి ఎక్కడకూ వెళ్ళడమే మానుకున్నాడు.

కొన్నాళ్ళకు ఆ దంపతులకు రాహులుడు అనే కుమారుడు కలిగాడు. జననీ జనకులకూ, తాత శుద్ధోదన మహారాజుకూ కన్నులపండుగగా అల్లారుముద్దు మురిపాలతో పెరుగుతున్నాడు.

సిద్ధార్థుడు ఒకనాటి సాయంకాలం రథారూఢుడై చెన్నుణ్ణి నగరంలోకి తోలమన్నాడు. అనుకోని నగరవిహారానికి చెన్నుడు వెనుకాడుతూనే రాకుమారుడి దృఢసంకల్పం తెలిసినవాడవడం వల్ల, కాదనక రథాన్ని తీసుకెళుతున్నాడు.

జరాభారంతో కృంగిపోతూన్న ఒక ముదివగ్గు పడుతూ లేస్తూ ఎదురుగా వస్తున్నాడు. అతని స్థితి దయనీయంగా ఉంది. ఎవ్వరూ ఆ వృద్ధుడిపట్ల చూపవలసిన జాలి చూపి లేవనెత్తటం లేదు. ఎవరి మానాన వారివారి పనుల మీద పోతున్నారు.

కొంత దూరం వెళ్ళగా ఒక రోగపీడితుడు ఎదురయ్యాడు. అతడు దరిద్రుడని తెలుస్తున్నది. పైగా వ్యసపరుడని

అతడు మాటిమాటికీ చేసే సురాపానం చెబుతున్నది.

ఆ తర్వాత ఒక శవాన్నిశ్మశానానికి వాహకులు తీసుకెళ్తూండడం కనిపించింది.

చివరగా, సర్వసంగ పరిత్యాగం చేసి భిక్షాటనం చేస్తున్న ఒక భిక్షువు ఎదురయ్యాడు.

అంతవరకు కప్పి ఉన్న నివురు తొలగిన నిప్పులాగ సిద్ధార్థుడి బుద్ధి ప్రకాశించింది.

అప్పుడే గౌతముడు బుద్ధుడు అవడానికి అంకురార్పణ జరిగింది.

రాకుమారుడు ఆ నాలుగు దృశ్యాల గురించీ పట్టిపట్టి చెన్నుడిని అడిగాడు. చెన్నుడికి నిజం చెప్పక తప్పిందికాదు.

సిద్ధార్థుడు రథాన్ని వెనక్కు మరల్చమన్నాడు. చెన్నుడు రథాన్ని రాజమందిరానికి చేర్చాడు.

ఆ రాత్రి సిద్ధార్థుడికి నిద్రపట్టలేదు. బయట సన్నని వెన్నెల కాస్తున్నది.

యశోధర నిద్రపోతున్నది. రాహులుడు తల్లి గుండెకు హత్తుకొని నిద్రిస్తున్నాడు. తల్లీ కొడుకుల ముఖాల్లో అమాయకత్వం ప్రకాశిస్తున్నది.

సిద్ధార్థుడు వారిని విడిచి కొన్ని అడుగులు నడిచి తిరిగి వచ్చాడు. అలాగ రెండుసార్లు జరిగింది.

మూడోసారి సిద్ధార్థుడు మనసు దిటవు చేసుకొని యశోధర పాదాల మీద ఒక కలువను ఉంచి, పాదాలను స్పృశించి, నమస్కరించి వెనుదిరిగి బయలుదేరాడు.

అంతఃపురం నుండి అశ్వశాలకు వెళ్ళాడు. చెన్నుడిని మేల్కొలిపి అశ్వాన్ని సిద్ధం చెయ్యమన్నాడు.

రాకుమారుడికిఅర్ధరాత్రిచిరువెన్నెలలో గుర్రమెక్కి తిరగాలనిపించింది కాబోలు అనుకున్నాడు, చెన్నుడు. అప్పుడే చిన్న జల్లుపడి నేలంతా తడిసి మెత్తగా ఉంది.

సిద్ధార్థుడు గుర్రాన్నెక్కి కూర్చున్నాడు. చెన్నుడు కళ్లాన్ని పట్టుకొని నడిపిస్తున్నాడు. అంతా నిశ్శబ్దంగా ఉంది. గుర్రపు డెక్కసవ్వడి నేల మెత్తగా ఉండడం వల్ల వినిపించ లేదు.







# హస్తసాముద్రికం

మునిపల్లె గ్రామంలో కృష్ణశాస్త్రి అనే హస్తసాముద్రికవేత్త వుండేవాడు. ఆయన ఆ గ్రామంలోనే కాక, చుట్టుపక్కల అనేక గ్రామాల్లో పేరుప్రతిష్ఠలు సంపాయించాడు. కాని, కడుపేదగా కాలం నెట్టుకు వస్తున్నాడు. అందుక్కారణం, ఆయన అంత పండితుడై వుండీ, శ్రీమంతుల నుంచి కూడా తగిన ప్రతిఫలం అడగక, వారిచ్చినదేదో తీసుకుంటూ వుండడం.

ఆయన భార్య రాజ్యలక్ష్మికి, యీ ధోరణి ఏమాత్రం నచ్చేదికాదు. తన దగ్గిరకు వచ్చే ధనవంతులనుంచయినా, ముందుగా యింత అని చెప్పి, బాగా డబ్బు రాబట్టమనేది. కాని, కృష్ణశాస్త్రి, "ఈ హస్తసాముద్రికం అనేది గొప్ప శాస్త్రం. కోటీశ్వరుడైనవాడు కూడా, నా దగ్గిరకు వచ్చి, చెయ్యి చూపించుకుని, నాపట్ల ఎంతో భక్తిశ్రద్ధలు చూపి వెళుతున్నాడు. అలాంటి పరిస్థితుల్లో నేను వాళ్ళను ముందే యింత ప్రతిఫలం యివ్వమని అడగడమంటే, అది వ్యాపారం అయి వూరుకుంటుంది. అప్పుడు పండితుడినైన నన్ను, వ్యాపారిని చూసినట్టు చూస్తారు!" అనేవాడు.

"అయితే, మన దారిద్ర్యం ఎన్నటికీ తీరదు!" అనేది భార్య.

క్రమంగా కృష్ణశాస్త్రి హస్తసాముద్రికంలో ఉద్దండపండితుడనే సంగతి, ఆ దేశాన్నేలే రాజుకు తెలిసింది. ఆయన ఆస్థానంలో అన్ని కళలలో, శాస్త్రాల్లో ఆరితేరిన పండితులు చాలామంది వున్నారు. కాని, హస్తసాముద్రికశాస్త్రంలో మాత్రం చెప్పుకోదగిన పండితుడు లేడు.

రాజుకు, కృష్ణశాస్త్రిని తన ఆస్థానంలో చేర్చుకోవాలన్న ఆలోచన వచ్చింది.

కె. కె. రావు



అయితే, ముందు తాను స్వయంగా పరీక్షించి చూడాలనుకున్నాడు. ఈ సంగతి మంత్రితో చెప్పి, కృష్ణశాస్త్రిని పిలిపించ మన్నాడు.

మంత్రి పంపిన భటులు కృష్ణశాస్త్రి దగ్గిరకు వచ్చి, ఆయనను రాజాస్థానానికి రావలసిందిగా కోరారు. ఇది విన్న గ్రామ ప్రజలు ఆయనకు మహర్దశపట్టనున్నదని చాలా సంతోషించారు. భార్య రాజ్యలక్ష్మి, యీనాటితో తమకు దారిద్ర్య బాధలు తీరిపోయినవని చాలా ఆనందించింది.

అయితే, కృష్ణశాస్త్రి మాత్రం నిర్వి కారంగా కూర్చుని ఆలోచిస్తూ వుండి పోయాడు. ఇది చూసి గ్రామ ప్రజలకు ఆశ్చర్యం కలిగింది. ఆయన భార్యకు ఎక్కడలేని కోపం వచ్చింది.

ఆమె భర్తకు ప్రయాణానికి సిద్ధం కమ్మని చెప్పబోయేంతలో కృష్ణశాస్త్రి, రాజభటులతో, "నేనీనాటివరకూ ఎవరి ఇళ్ళకూ వెళ్ళి హస్తసాముద్రికం చెప్పింది లేదు. అవసరం అనుకుంటే ఎంతవారైనా, నా దగ్గిరకే వస్తారు. ఈ మాటే మీ రాజు గారితో చెప్పండి!" అన్నాడు.

ఈ విధంగా రాజు కోర్కెను తిరస్క రించినందుకు, కృష్ణశాస్త్రి తప్పక దండన పాలవుతాడని గ్రామస్థులూ, ఆయన భార్యా కూడా భయపడ్డారు.

భటుల ద్వారా సంగతి విన్న రాజు ఒక క్షణకాలం నివ్వెరపోయాడు. తరవాత ఆయన మంత్రిని పిలిచి సంప్రతించాడు.

వారం రోజుల తరవాత రాజే స్వయంగా మేనాలో తమ గ్రామం రావడం చూసి ప్రజలంతా సంభ్రమాశ్చర్యాలలో మునిగి పోయారు. కృష్ణశాస్త్రి భార్యకు, రాజుకు ఎలాంటి మర్యాదలు జరపాలో పాలుపోక మతిపోయినంత పనయింది.

కృష్ణశాస్త్రి మాత్రం తొట్రుపడకుండా రాజును ఆహ్వానించి, ఆయన వచ్చిన పని తెలుసుకున్నాడు. తరవాత ఆయన హస్తాన్ని పరీక్షించసాగాడు. రాజు గంభీ రంగా ఆయన ముఖం కేసి చూస్తూ వుండి

పోయాడు. రాజు వెంట వచ్చిన యిద్దరు భటులు అంతా గమనిస్తున్నారు.

కృష్ణశాస్త్రి, రాజు హస్తరేఖల్ని ఒక అరగంట కాలం ఎంతో జాగ్రత్తగా పరీక్షించి చూశాడు. ఆయనకు అంతా అయోమయంగా వున్నది. ఆ హస్తరేఖల్లో ఏ ఒక్కదానికీ రాజయోగ లక్షణం లేదు. ఆ వ్యక్తి జీవితకాలమంతా పరులను సేవిస్తూ పొట్ట నింపుకోవలసిందే!

కృష్ణశాస్త్రి చిన్నగా నిట్టూర్చి రాజుతో, "మహారాజా, క్షమించండి! నాకున్న శాస్త్రజ్ఞానం, అనుభవం కూడా అతి స్వల్పమని తేలిపోయింది. హస్తరేఖా ఫలితాల్ని గుణించినప్పుడు, మీరు ఏ దేశానికీ రాజు అయే యోగం లేదు. కాని, మీరు మహారాజులు!" అని, పక్కనే వున్న తాళపత్రగ్రంథాలను ఒక మూలకు విసిరివేసి, భార్యకు నిప్పు తీసుకురావలసిందిగా ఆజ్ఞాపించాడు.

ఇది విని కృష్ణశాస్త్రి భార్య నిర్ఘాంత పోయింది. శాస్త్రి కోపంగా ఆమెకేసి చూసి, నిప్పు తెమ్మని మరొకసారి చెప్ప బోయేంతలో, అప్పటివరకూ దూరంగా నిలబడివున్న రాజ భటులిద్దరూ ఆయన దగ్గిరకు వచ్చారు.

వాళ్ళల్లో ఒకడు కృష్ణశాస్త్రికి నమస్కరిస్తూ, "అయ్యా, మీరు సాముద్రిక శాస్త్రంలో పారంముట్టినవారు; సందేహం లేదు. ఇప్పటివరకూ మీరు పరీక్షించిన చెయ్యి రాజుగారిది కాదు, ఆయన ప్రధానసేవకుడిది! ఇదుగో, భటుడి వేషంలో వున్న వీరు, మహారాజుగారు. నేను వారి మంత్రిని," అన్నాడు.

ఇది విన్న కృష్ణశాస్త్రికీ, ఆయన భార్యకూ, గ్రామస్థులకూ కలిగిన ఆనందం అంతాయింతా కాదు. రాజు, కృష్ణశాస్త్రిని యిలాంటి పరీక్షకు గురి చేసినందుకు క్షమాపణ కోరాడు.

తరవాత వారం తిరక్కుండానే ఆయన, కృష్ణశాస్త్రిని ఘనంగా సన్మానించి, తన ఆస్థానంలో సాముద్రికశాస్త్ర పండితుడుగా నియమించుకున్నాడు.





# దొంగకు సన్మానం

మోసుల్ సుల్తాను రాజ్యపర్యటన చేస్తూ, ఒకనాటి రాత్రి ఒక చిన్న పట్టణంలో విడిదిచేశాడు. తెల్లవారబోతున్న సమయంలో విడిదిలో పెద్ద కలకలం బయలుదేరింది. ఆయన పరివారంలో ఒకడికి సుల్తాను నిద్రిస్తున్న గది ప్రాంతాన దొంగ ఒకడు కనిపించి, ఎటో పారిపోయాడు.

సుల్తాను నిద్రమేల్కొని, తన వెంట వచ్చిన సైనికోద్యోగులకూ, సేవకులకూ దొంగ నెలా అయినాసరే పట్టి బంధించమని ఆజ్ఞయిచ్చాడు. దొంగ విడిది భవనం నుంచి బయిటికి పోలేదని తెలుస్తూనే వున్నది. అంటే, వాడు భవనంలోనే ఎక్కడో దాగి వున్నాడన్న మాట!

కాని, ఎంత వెతికినా భవనంలో ఎక్కడా దొంగజాడ లేదు. ఆసరికి సూర్యోదయం కావడంతో దాపులనున్న ఇళ్ళవాళ్ళు అక్కడ గుమిగూడారు.

సుల్తానుకు చాలా కోపంగా వున్నది. ఆయన వెంటనే బయలుదేరి తన రాజధానికి పోవలసి వున్నది.

ఇంతలో హఠాత్తుగా ఒక గది మూల నుంచి ఎవరో పెద్దగా తుమ్మిన ధ్వని వినబడింది. సైనికోద్యోగులు అక్కడికి పరిగెత్తారు. గది మూల గుడారాలకు ఆచ్ఛాదనగా ఉపయోగించే వస్త్రాలు చుట్టలుగా చుట్టబడి వున్నది. దొంగ ఆ చుట్టలమధ్య దాక్కుని వున్నాడు.

సైనికోద్యోగులు వాణ్ణి బయిటికి లాగి కొట్టబోయేంతలో వాడు, ''అయ్యా, కొంచెం నిదానించండి. నేను సుల్తాను గారితో రహస్యంగా మాట్లాడవలసిన విషయం ఒకటున్నది,'' అన్నాడు.

ఒక సైనికోద్యోగి సుల్తాను దగ్గిరకు పోయి, ''ప్రభూ, దొంగ దొరికాడు. వాడి తుమ్మే వాణ్ణి పట్టి యిచ్చింది. అయితే,

వాడు తమతో ఏకాంతంగా ఏదో మాట్లా డాలంటున్నాడు.'' అని చెప్పాడు.

''దొంగ నాతో ఏకాంతంగా మాట్లాడా లంటున్నాడా?'' అంటూ సుల్తాను ఆశ్చర్యపోయి, ''వీడెవడో చిల్లరజాతి కన్నపుదొంగ! సరే, పంపండి. వాడు చెప్ప దలిచిందేమిటో వింటాను,'' అన్నాడు.

దొంగ సుల్తానుతో, ''ప్రభూ, నన్ను తమరెంతో ఘనంగా సత్కరించవలసి వున్నది. ఆ పని చేయకపోగా, మీ ఉద్యోగులు నన్ను కొట్టజూస్తున్నారు,'' అన్నాడు.

''నిన్ను సత్కరించడమా! ఎందుకు?" అన్నాడు సుల్తాను కోపంగా.

''ప్రభూ, మీ పరివారం అంతా నాకోసం భవనం గాలించి, యిక నేను దొరకనని ఆశవదులుకున్నారు. మీరు రాజధానికి ప్రయాణం కాబోతున్నారు. ఈ జరిగిన గొడవ చూడడానికి చాలామంది జనం యిక్కడ గుమిగూడారు కదా. వాళ్ళు, మీ సైనికోద్యోగుల తెలివితేటల్ని గురించీ, శక్తిసామర్థ్యాల గురించీ ఏమనుకుంటారు?'' అంటూ ఆగాడు దొంగ.

చెప్పమన్నట్టు సుల్తాను విసుగ్గా తలాడించాడు.

''దొంగ బయిటికి పారిపోలేదనీ, భవనంలోనే ఎక్కడో దాగివున్నాడనీ అందరూ అనుకుంటున్నదే! అలాంటి వాణ్ణి కూడా మీ ఉద్యోగులు పట్టలేక పోతే, జనం దృష్టిలో వాళ్ళెంత చులకనై పోతారు. అది జరక్కుండా వాళ్ళ మర్యాద కాపాడేందుకే, నేనంత గట్టిగా తుమ్మాను. నా ప్రాణం కన్న ప్రభువులైన తమ గౌరవమర్యాదలే, నా కెక్కువ!'' అన్నాడు దొంగ.

''ఔరా, నిజం!'' అంటూ సుల్తాను తలవూపి, జనం చూస్తూండగా వాడి చేతులకు సంకెళ్ళు వేయించాడు.

తరవాత ఆయన పట్టణం వదిలి రాజధాని కేసి కొంత దూరంపోయాక, దొంగ సంకెళ్ళు తీయించి, కొంత ధనం యిచ్చి, స్వేచ్ఛగా వదిలివేశాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Devidas Kasbekar



M. Natarajan

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ సెప్టెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: పేద పిల్లల వారసత్వం        రెండవ ఫోటో: కూటికోసం కాయకష్టం

పంపినవారు: శ్రీమతి ఎస్. జ్ఞానేశ్వరి, ఖమ్మం–507 003, (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు

1. హెన్రీ డ్యూరంట్ 2. సోవియట్ రష్యాకు చెందిన అలెక్సీ ఏ. లియోనోవ్ 3. నార్వేకు చెందిన రొనాల్డ్ అముండ్సెన్ (4 డిసెంబర్ 1911) 4. నార్వేకు చెందిన ట్రిగ్వి లీ. 5. స్వామి వివేకానంద.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, . Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.